Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 81 • సంచిక: 27 • 2-7-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# రక్తి కట్టనున్న జగన్నాటకం!

రాష్ట్ర కాంగ్రెస్‌లో ఆధిపత్యం కోసం, తన తండ్రి వారసత్వ అధికార పీఠం కోసం గత పది నెలలుగా వైఎస్.జగన్ చేస్తున్న పోరాటం పతాక స్థాయికి చేరుకోబోతున్నది. కాంగ్రెస్ అధిష్టానంతో అమీ తుమీ తేల్చుకోవడానికి సన్నాహాలు చేస్తున్నాడు జగన్. జూలై 8తేది నుంచి తలపెట్టిన శ్రీకాకుళం జిల్లా ఓదార్పు యాత్ర విషయంలో వెనక్కు తగ్గకూడదని ఆయన తీసుకొన్న నిర్ణయం రాష్ట్ర రాజకీయాలను సంక్షుభితం చేయబోతున్నది. చిట్టచివరి ప్రయత్నంగా, 29తేది సాయంత్రం తన తల్లి విజయలక్ష్మి గారితో కలసి సోనియాగాంధీని కలిశాడు. ఓదార్పు యాత్రకు అనుమతి కోరాడు. కానీ సోనియా అందుకు సానుకూలంగా స్పందించ లేదు. వైఎస్.రాజశేఖర్‌రెడ్డి మరణ ఖేదాన్ని భరించ లేక విగతజీవులైన వారి కుటుంబాలను పరామర్శించడానికి ఆడంబరంతో కూడిన యాత్రలెందుకు, వారిని పిలిచి చేయదలచిన సహాయం చేస్తే పోలేదా అన్న తీరులో మాట్లాడారట ఆమె.

కాంగ్రెస్ పార్టీలో తనకు ఆదరణ లభించదన్న నిజాన్ని సోనియా మాటలు రుజువు చేశాయని భావిస్తున్నాడు జగన్. ఇప్పుడు ఆయన ముందున్నవి రెండు మార్గాలు. అధిష్టానం అనుగ్రహం లభించే వరకు ఓర్పుతో వేచి వుండడం, లేదంటే అధిష్టానంతో నాకేమి పనని అన్న తీర్మానానికి రావడం. సోనియాతో సమావేశంలో కుండబ్రద్దలు కొట్టినట్లు మాట్లాడాడట జగన్. ఆయన వాదనకు తల్లి, సోదరి వంత పాడారు. తమ కుటుంబంలో జగన్ మాటకు తిరుగులేదన్న సమాచారాన్ని సోనియాగాంధీకి చేరవేయడం కోసమే వారిద్దరు కూడా ఢిల్లీ వెళ్లారు. నా ఓదార్పు యాత్ర వల్ల పార్టీకి వచ్చే నష్టం ఏమీ లేదు. పైగా లాభం కూడా. ఉపఎన్నికలకు ఇది అడ్డంకి కాదు. నేను మీ కుటుంబానికి పూర్తిగా విధేయుడను. కానీ నాకు తగిన గుర్తింపు లభించడం లేదు. నామీద లేనిపోని పితూరీలు మీకు చెప్తున్నారు. మీరు అర్థం చేసుకొని నా యాత్రకు అనుమతి ఇవ్వండని కోరాడట. అయితే ఇటువంటి వివాదాల సమయంలో తమ భావనలు బయట పెట్టకుండా నర్మగర్భంగా మాట్లాడడం ఎఐసిసి అధ్యక్షుల ఆచారం. దానికి తగినట్లే సోనియా మౌనం పాటించారు. బాధితులందరినీ ఒక చోటకు చేర్చి, పరామర్శ చేయడం లేదా బాధితుల ఇంటికి ఆర్భాటం లేకుండా వెళ్లి పలకరించి రావడం చేయకూడదా అని మాత్రం సూచించారట ఆమె. అందుకు జగన్ ఒప్పుకోలేదు.

తాను చెప్పాల్సింది అంతా చెప్పేశాను కాబట్టి, అనుమతి ఇవ్వడం అధిష్టానం ధర్మం అనే ధోరణిలో వున్నాడు జగన్. ఇక నుంచి తను కానీ, తన తరఫున మరొకరు కానీ ఢిల్లీ వెళ్లి అనుమతి అడిగే ప్రశ్న లేదని తేల్చి చెప్తున్నాడు. 8తేది లోపల అనుమతి వస్తేసరే. లేకుంటే, యాత్ర వద్దని మళ్లీ చెప్ప లేదు కాబట్టి, మౌనం అర్ధాంగీకారం అని యాత్ర మొదలు పెట్టేయాలనే నిర్ణయానికి వచ్చాడు.

దీని అర్థం అధిష్టానంతో అమీ తుమీ తేల్చుకోవడానికి సిద్ధం కావడమన్న మాట. ఆయన శ్రీకాకుళం ప్రయాణం మొదలు పెట్టిన ప్రక్క క్షణం నుంచి రాష్ట్ర రాజకీయాలు రంజుగా మారడం సహజం. శ్రీకాకుళంలో జగన్‌ను స్వాగతించేవారు, సభలలో పాల్గొనే ఎమ్మెల్యేలు, ఎమ్పీల ఆధారంగా రాజకీయ జగన్నాటకానికి తొలి అంకం మొదలౌతుంది. అధిష్టానం వద్దు అన్నది కాబట్టి, ఆ యాత్రలో పాల్గొనే వారంతా పార్టీని ధిక్కరించిన వారౌతారు. అంత సాహసం చేసే వారెవరు అన్నది ప్రశ్న. ఎమ్మెల్యేలు, ఎమ్పీలు లేకుండా ఒంటరిగా వెళ్తే జగన్ వెల్తిపడతాడు. వైఎస్ పట్ల తమకున్న భక్తితో ఆయన్ను ఎవరైనా అనుసరిస్తే పార్టీకి దూరం కాక తప్పదు.

ముఖ్యమంత్రి రోశయ్య ఈ వినోదాన్ని బాగానే ఆస్వాదిస్తున్నాడు. 7తేది నుంచి శాసనసభ సమావేశాలు పెట్టి, ఎమ్మెల్యేల కాళ్లకు బంధాలు బిగించాడాయన. వూళ్లోనే వున్నాము కాబట్టి, తమ వూరికి వచ్చిన జగన్‌ను పలకరించకుండా వుండలేకపోయామన్న కుంటిసాకులు చెప్పే అవకాశం లేదు. అయితే

కొరవ 14వ పేజీలో

# ఇదా సంస్కరణ?

పెట్రోల్ ధరల నియంత్రణను ఎత్తివేసింది కేంద్ర ప్రభుత్వం. అంతర్జాతీయ మార్కెట్‌లో ముడి చమురు ధరలకు అనుగుణంగా ఎప్పటికప్పుడు పెట్రోల్ ధరను పెంచుకోవడానికి ఆయిల్ కంపెనీలను అనుమతించింది. పెట్రోల్ ఉత్పత్తుల మీద ఇంతకాలం ఇస్తున్న సబ్సిడీల భారం అనూహ్యంగా పెరిగిపోతున్నదని, దాన్ని మోయడం ప్రభుత్వతరం కానందువల్లనే ఈ నిర్ణయం తీసుకొన్నామని చెప్తున్నాడు ప్రధానమంత్రి మన్మోహన్ సింగ్. అంతర్జాతీయ ముడి చమురు ధర కంటే పెట్రోల్ ధరను తగ్గించి అమ్మడం వల్ల కంపెనీలు ఏటా లక్ష కోట్ల రూపాయల వరకు నష్టపోతున్నాయని చెప్తున్నాడు ప్రధాని.

మన్మోహన్ సింగ్ పూర్వాశ్రమంలో ప్రపంచ బ్యాంక్ అధికారిగా పనిచేశాడు. ప్రపంచ బ్యాంక్ అంటే అమెరికా తొత్తు సంస్థ. అమెరికన్ వ్యాపార వర్గాల ప్రయోజనాల కోసం మొత్తం ప్రపంచాన్ని తీర్చిదిద్దడం దాని లక్ష్యం. ఆయన మీద ఆ సంస్కృతి ప్రభావం జాస్తి. పేద ప్రజల కడగండ్లు, సామాన్య కుటుంబాల సమస్యల మీద ఆయనకు కనీస అవగాహన వుండదు. ఆర్థిక పరిస్థితులలో అమెరికాకు, భారత దేశానికి హస్తి మసకాంతరం వుంది. కానీ మన్మోహన్ సింగ్ మాత్రం అమెరికన్ కోణం నుంచి మాత్రమే ఆలోచన చేస్తాడు. నిర్ణయాలు తీసుకొంటాడు. గత ఇరవై ఏళ్లుగా ఆయన నడిపిస్తున్న ఆర్థిక సంస్కరణల మౌలిక సూత్రాలు ఈ ప్రాతిపదిక మీద రూపు దిద్దుకొన్నవే. అందులో పెట్రోల్ ధరల నియంత్రణ ఎత్తివేత ఒక చిన్న భాగం.

పెట్రోల్ మీద ఇస్తున్న సబ్సిడీ ప్రభుత్వం తలమీద మోయలేని భారంగా పరిణమించిన మాట నిజం. అందులో సందేహం లేదు. కానీ ఆ బరువు దించుకోవడానికి ప్రజల నెత్తిన సమ్మెట పోటు వేయడం ఒక్కటే మార్గం కాదు. మన దేశంలో పెట్రోల్ నిల్వలు తక్కువగా వున్నా, ఐరన్‌ఓర్, మాంగనీస్, బాక్సైట్ వంటి ఖనిజాలు అపారంగా వున్నాయి. ఒక్క ఐరన్‌ఓర్ ఖనిజమే ఏడాదికి కోటి 100 మిలియన్ టన్నులకు పైబడి జరుగుతున్నది. అంతర్జాతీయ మార్కెట్‌లో పెట్రోల్ బారెల్ ధర, ఇనుప ఖనిజం టన్ను ధర 65 డాలర్ల ప్రాంతంలోనే నడుస్తున్నాయి. కేంద్ర ప్రభుత్వం ఒక విధాన నిర్ణయం తీసుకొని, ఇనుప ఖనిజం గనులన్నిటినీ జాతీయం చేస్తే, మొత్తం ఐరన్ ఓర్‌ను ప్రభుత్వ పరంగానే ఎగుమతి చేస్తే, పెట్రోల్ మీద ఒక్క రూపాయి సబ్సిడీ ఇవ్వవలసిన అవసరం లేకుండా లెక్క సరిపోతుంది. ప్రభుత్వానికి గనుల వ్యాపారం చేయడం ఇష్టం లేకపోతే, గనులను ప్రైవేట్ వ్యక్తులకే ఇచ్చి, వారు ఖనిజాన్ని త్రవ్వి తీసినందుకు టన్నుకు వంద లేదా రెండు వందల రూపాయలు చెల్లిస్తే సరిపోతుంది. బొగ్గు గనుల విషయంలో సింగరేణి కాలరీస్ వంటి ప్రభుత్వ సంస్థలు అనుసరిస్తున్న విధానం ఇదే. ఎగుమతులు మాత్రం ఎన్ఎండిసి వంటి ప్రభుత్వ సంస్థల ద్వారా జరిపిస్తే, ప్రభుత్వ ఖజానాలో ఏడాది తిరిగే సరికి లక్ష కోట్ల రూపాయలు జమ పడుతాయి. ఆ డబ్బు పెట్టి ఎంత పెట్రోల్ అయినా కొనవచ్చు. కానీ ఇనుప ఖనిజం గనులన్నిటినీ గాలి జనార్దనరెడ్డి వంటి వారికి కేటాయించి, వారు లక్షల కోట్ల రూపాయల సంపద మూటగట్టుకోవడానికి అనుమతిస్తున్న మన్మోహన్ సింగ్, పేద ప్రజలు పెట్రోల్‌కు అధిక ధర చెల్లించాలని నిర్బంధిస్తున్నాడు.

ఆర్థిక సంస్కరణల అసలు స్వరూపం అర్థం చేసుకోవడానికి ఐరన్ ఓర్ ఉదాహరణ ఒక్కటి చాలు. మరొక కోణంలో చూస్తే, అంతర్జాతీయ విపణిలో క్రూడ్ ఆయిల్ ధరకు, ప్రజలు పెట్రోల్‌కు చెల్లిస్తున్న ధరకు కూడా పొంతన లేదు. క్రూడ్ ఆయిల్ ధర ప్రకారం చూస్తే, లీటర్ పెట్రోల్ ధర పాతిక లేదా ముప్పై రూపాయలు దాటడానికి లేదు. కానీ అటు కేంద్ర ప్రభుత్వం, ఇటు రాష్ట్ర ప్రభుత్వం కలిసి లీటర్ పెట్రోల్ మీద ముప్పై రూపాయల వరకు పన్నులు విధిస్తున్నాయి. అందువల్లనే పెట్రోల్‌కు అంత ధర.

ఖనిజాలు దేముడిచ్చిన సహజ వనరులు. వాటిని ప్రజల శ్రేయస్సు కోసం వినియోగించడం ప్రభుత్వ ధర్మం. వాటిని సంపన్నులకు దోచిపెట్టి, సామాన్యుల మీద మాత్రం ధరల సమ్మెట పోటు వేయడం, అది చాలక పన్నుల మోత మోగించడం ఆర్థిక సంస్కరణే అంటున్నాడు మన మన్మోహనుడు. అమెరికా ఆయనకు అటువంటి పాఠాలు నేర్పింది. అది మన ప్రారబ్ధం.

జమీన్‌రైతు

## జనవాణి

### పేద ప్రజలపై పెనుభారం!

కేంద్ర ప్రభుత్వం పెంచిన గ్యాస్, కిరోసిన్, డీజిల్, పెట్రోల్ ధరలు సామాన్య, మధ్యతరగతి ప్రజలను మరింత కృంగదీస్తాయి. గ్యాస్ సిలిండర్‌పై 35రూపాయలు, లీటరు కిరోసిన్‌పై మూడు రూపాయలు, పెట్రోల్‌పై 3-57 పైసలు, డీజిల్‌పై రెండు రూపాయలు పెంచడం అన్యాయం. నగరాలు, పట్టణాలలో కట్టెలు అందుబాటులో లేవు. అందువల్ల వంటచేయను గ్యాస్, కిరోసిన్ లలో ఏదో ఒకటి కావాలి. వీటి ధర పెంచడం సహేతుకం కాదు. డీజిల్ రేట్లు పెంచడం వల్ల ఆ ప్రభావం వస్తురవాణా రంగంపై పడుతుంది. నిత్యావసర వస్తువుల ధరలు ఇంకా పెరిగిపోతాయి. యుపిఏ ప్రభుత్వంలో సామాన్యులకు వాత, పారిశ్రామికవేత్తలకు వేల కోట్ల రాయితీలు ఇవ్వడం తగనుగాక తగదు.

–కొప్పోలు రామారావు, నెల్లూరు

### ఎన్‌కౌంటర్ పరిష్కారం కాదు!

పోలీసుల మెతకవైఖరి వల్ల జిల్లాలో వరుస దొంగతనాలు, దారిదోపిడీలు ఎక్కువయ్యాయి. పేరుగాంచిన కప్పరాళ్ల తిప్ప దొంగలను విచారించే క్రమంలో వారు పోలీసుల మీద తిరగబడడం మామూలు విషయమేమి కాదు. ఈ క్రమంలో జిల్లా పోలీసు యంత్రాంగం పేరు మోసిన తిప్ప దొంగ పీరిగ వెంకటేశ్వర్లును ఎన్‌కౌంటర్ చేసి ఆ శాఖలో పనిచేసే సిబ్బందిలో ఆత్మస్థైర్యం నింపింది. అయితే నేరస్తులను అదుపుచేయను ఎన్‌కౌంటర్ ఒక్కటే పరిష్కారం కాదు. పోలీసులు చిత్తశుద్ధితో విధులు నిర్వహించడం, నిజాయితీగా వుంటే నేరస్తులు పాదక్రాంతులవుతారన్న అసలు నిజం మరిస్తే ఎలా?

–సిహెచ్.హనుమంతరావు, నెల్లూరు

### త్రాగునీటిని వృథా చేయకండి!

సమస్త ప్రాణికోటికి నీరు ఎంతో అవసరం. అయితే మునిసిపల్, గ్రామ పంచాయితీల నిర్వాహకులు త్రాగునీటి సరఫరా, నిర్వహణ వ్యవస్థ పట్ల అశ్రద్ధ వహిస్తున్నారు. నెల్లూరు నగరంలోని ఎన్నో ప్రాంతాల ప్రజలు మంచినీటి కోసం కటకట లాడుతుంటే కొన్ని ప్రాంతాల్లో వీధి కొళాయిల్లోని నీరు మూతలు లేక వృధాగా పోతుంటుంది. నాసిరకం కొళాయిలు వాడడం వల్ల ఈ సమస్యకు పరిష్కారమే దొరకడం లేదు. గ్రామీణ ప్రాంతాల్లో సైతం ఈ పరిస్థితులు

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

5-7-1940
పేజీలు : 16 వెల: అణా

### నెల్లూరు ముచ్చట్లు

కాలేజి కమిటీలో ఏ.సి.సుబ్బారెడ్డికి ఇతర్లకు పొరపచ్చాలొచ్చాయనీ, ఈ చిత్రంలో రెడ్డిగారు మునిసిపల్ అధ్యక్షతకు రాజీనామాను కాంగ్రెస్ పార్టీకి పంపాడని తెలుస్తోంది.

మునిసిపల్ ఎన్నికలు మరో సంవత్సరం పొడిగించిన ఈ శుభ సమయంలో ఎందుకు రాజీనామా పెడుతున్నారబ్బా?

***

కాంగ్రెసు పార్టీ జిల్లా బోర్డు సభ్యుడు వెన్నెలకంటి గోపాలరావు గారు యుద్ధ ఫండుకు చందా యిచ్చాడని కొందరు కాంగ్రెసువారు ఆక్షేపిస్తున్నారు. రేబాల దశయ్యకు అవిభక్త తమ్ముడు పేరయ్య, ఏనుగ రాఘవరెడ్డి అవిభక్త సోదరుడు పట్టయ్య చందా యిస్తే లేని ఆక్షేపణ గోపాలరావు గారికి మాత్రం ఎందుకొచ్చింది.

***

ముత్తుకూరు డాక్టరు అక్కాపంతుల కొండయ్య విషయం ఆ ఊళ్లో విచారించాను. ఏమైనాగానీ తగ్గు జనంలో మాత్రం పాపులారిటీ లేదు. అది సంపాదించుకోవయ్యా పంతులూ!

### మద్రాసు ప్రభుత్వ ప్రకటన!

ప్రస్తుతం నెల్లూరు జైలులో 12 మందిని గవర్నమెంటు అరెస్టు చేసి విచారణ లేకుండా పెట్టి వున్నారు. వారి పేర్లకు బదులుగా గవర్నమెంటు వారు ABC అనే అక్షరాలు ఉపయోగించి వారి నిర్బంధమునకు కారణాలను ప్రకటించారు.

### కరెన్సీ నోటు వద్దన్నందుకు అరెస్ట్

పది రూపాయల నోటు ఇచ్చి పంచదార ఇమ్మని అడగగా ముగ్గురు దుకాణాదారులు పది రూపాయల కాగితాన్ని తీసుకోడానికి నిరాకరించారు. ఇండియా రక్షణ చట్టం క్రింద ఆ ముగ్గురు దుకాణాదార్లను భేరా పోలీసువారు అరెస్ట్ చేశారు.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

1-7-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### సంజీవయ్య × సుబ్బారెడ్డి

గత మాసం దేశం మొత్తం దృష్టిని ఆకర్షించిన ఏ.సి.సుబ్బారెడ్డి వ్యవహారం ఈవారం మరలా ఆంధ్ర శాసనసభలో ప్రస్తావనకు వచ్చింది. గత 27వ తేది ఏ.సి.సుబ్బారెడ్డి తాను రాజీనామా యివ్వవలసిన పరిస్థితిని గురించి శాసనసభలో ప్రకటన చేశారు. సుబ్బారెడ్డి మీద తాను తీసుకున్న చర్యను ముఖ్యమంత్రి దామోదరం సంజీవయ్య శాసనసభలో సమర్థించుకొన్నారు. ఇరువురి ప్రకటనలు పరస్పర ఆరోపణలుగా వున్నవి.

### మన రాష్ట్రపతి పట్ల రష్యా అమర్యాద?

రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ పర్యటనలో ఆ ప్రధాని కృశ్చేవ్ పేరు ఎక్కడా వినబడడం లేదు. వారికి స్వాగత మిచ్చినట్లుగాని, కలుసుకున్నట్లు గాని లేదు. దేశంలో లేదనేది కారణం గావచ్చు. కానీ దేశంలో లేకుండా ఎందుకు పోవాలా? కృశ్చేవ్ భారతదేశం వస్తే రాజకీయమర్యాద ప్రకారం ప్రధాని ఒక్కడు స్వాగత మిస్తే చాలు. కానీ రాష్ట్రపతి మొదలు అందరూ వారికి ఘనమైన స్వాగతమిచ్చారు. వారి కార్యక్రమాల్లో పాల్గొన్నారు. అలాంటప్పుడు రాష్ట్రపతి రష్యా పర్యటనలో కృశ్చేవ్ ముఖం తప్పించడం అమర్యాదకర ప్రవర్తన కాదా? కృశ్చేవ్‌కు రాష్ట్రపతి స్వాగతమివ్వకుంటే నెహ్రూకు జరగదు. మన రాష్ట్రపతికి ముఖం తప్పించినా కృశ్చేవ్‌కు జరుగుతుంది! అంతే.

### భగవంతుణ్ణుంచి గూడాగాదు!

గవర్నరు ప్రసంగంపై మాట్లాడుతూ మద్యనిషేధం విషయం ప్రస్తావించి కాంగ్రెస్ శాసనసభ్యుడు జి.రామస్వామిరెడ్డి యిలా అన్నాడు. "దొంగ సారా ఉత్పత్తి రాష్ట్రంలో లాభదాయకమైన కుటీర పరిశ్రమగా అభివృద్ధి చెందింది... మద్యనిషేధాన్ని భగవంతుడు గూడా అమలు జరుపలేడు".

# నెల్లూరు ముచ్చట్లు

## జనావర్ణమైన ఇందిరాభవన్

నెల్లూరులో ఇందిరాభవన్ కట్టి 23 ఏళ్లయ్యింది. అప్పటి నుంచి ఎన్నో సభలు, సమావేశాలు జరిగాయి. వాటిలో కేంద్ర, రాష్ట్రస్థాయి నేతలు పలువురు పాల్గొన్నారు. ఈ కార్యక్రమాలకు పార్టీ కార్యకర్తలు, అభిమానులు పెద్ద సంఖ్యలో హాజరయ్యారు. కానీ 29వ తేది జరిగిన నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి ఆత్మీయ సత్కార సభకు వచ్చిన పార్టీ కార్యకర్తలు, జనార్దన్‌రెడ్డి అభిమానులను చూసి ఈ కార్యక్రమాన్ని ఏర్పాటుచేసిన రాజీవ్‌భవన్ నేతలతోపాటు రాజకీయ పరిశీలకులు ఆశ్చర్యపోయారు. సత్కార సభ సాయంత్రం 5.30 గంటల కంటే 5.15 గంటలకే ఇందిరాభవన్ నిండిపోయింది. ఆతర్వాత వేలాదిగా వచ్చిన కార్యకర్తలతో ఇందిరాభవన్ రోడ్డు, విజయమహల్‌గేటు రోడ్డు, రామచంద్రారెడ్డి హాస్పిటల్ రోడ్డు, ప్రక్కనే వుండే గాంధీనగర్‌లోని రోడ్లు కిటకిటలాడిపోయాయి. ఈ అభిమాన జనం తాకిడి గాంధీబొమ్మ వరకు కాన వచ్చింది. సాయంత్రం ఆరు గంటల నుంచి 8.30 వరకు ఈ పరిస్థితిలో ఎటువంటి మార్పు రాకపోవడం నగరంలో చర్చనీయాంశమయ్యింది.

## డిఎస్సీ జాబితాలో అవకతవకలు

విద్యాశాఖ ఏ కార్యక్రమం చేపట్టినా, ఏ జాబితా విడుదల చేసినా అవకతవకలు సర్వసాధారణమై పోయాయి. ప్రభుత్వం టీచర్ పోస్టుల భర్తీకి నిర్వహించిన డిఎస్సీ పరీక్షా ఫలితాల జాబితా కూడా తప్పుల తడికగా విడుదల చేసి విద్యాశాఖాధికారులు మరోసారి సంచలనం సృష్టించారు. ఉపాధ్యాయ సంఘాలు, నిరుద్యోగులు కలెక్టర్‌కు జాబితాలోని తప్పులను ఎత్తిచూపగా ఆయన ఖంగుతిన్నారు. ఈ వ్యవహారాన్ని ఆసాంతం పరిశీలించమని డిఆర్వో జయరామయ్యను కోరడంతోపాటు నియామక విధి విధానాలపై స్పష్టమైన దస్త్రం పంపమని రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరారాయన.

## కలెక్టరేట్ ఏఓ పదవీ విరమణ

కలెక్టరేట్ పరిపాలనాధికారిగా పనిచేస్తుండిన వేలూరు శ్రీనివాసులు 30వ తేది పదవీ విరమణ చేశారు. నలుగురు కలెక్టర్ల దగ్గర చిన్నపాటి మాట అనిపించుకోకుండా ఆయన విధులను సక్రమంగా నిర్వహించారు. రెవిన్యూ సంఘం నేత కావడం వల్ల ఉద్యోగుల నుంచి కూడ ఆయనకు సంపూర్ణ మద్దతు లభించేది.

కలక్టరేట్ కొత్త పరిపాలనాధికారిగా భూ పరిపాలనా విభాగంలో పని చేసే మధుసూధన్‌శర్మను కలక్టర్ రాంగోపాల్ నియమించారు.

## ఇంటలిజెన్స్‌కు సమర్థుడు

నెల్లూరు ఇంటలిజెన్స్ డిఎస్పీగా మలిశెట్టి విజయకుమార్ బాధ్యతలు స్వీకరించారు. విజయకుమార్ ఎస్ఐగా పనిచేసినప్పటి నుంచి బాధ్యతాయుతంగా పనిచేసేవాడు. తిప్ప దొంగ బుస్సీని ఎన్‌కౌంటర్ చేసిన సమయంలో గాయపడ్డారాయన. రైల్వే సిఐగా పలు కేసులు ఛేదించిన ఘటికుడు. డిఎస్పీగా ప్రమోషన్ లభించిన తర్వాత చిత్తూరు డిటిసి డిఎస్పీగా పనిచేస్తూ నెల్లూరుకు బదలీ అయ్యారు. నిశ్శబ్దంగా పనిచేసే విజయకుమార్ ఇంటలిజెన్స్‌లో వుండాల్సిన డిఎస్పీనే.

## రేయ్... ఆటో ఇదేం పిలుపు!

మాట జారితే వెనక్కు తీసుకోలేమని పెద్దలెప్పుడో చెప్పారు. తమ మాట తీరు వల్ల ప్రజల్లో చులకనైపోయిన పోలీసులు ఇంకాస్త దూకుడుకుపోతూ గబ్బు పడుతున్నారు. నెల్లూరు నగరంలోని ట్రాఫిక్ పోలీసులు ఈ మధ్య ప్రతిరోజూ సాయంత్రం రోడ్డుపై వెళ్లే ఆటోలను తనిఖీ చేసే నిమిత్తం ఆపడంలో గందరగోళానికి లోనవుతూ వెనుక ట్రాఫిక్ నిలబడిపో యేట్లు చేస్తున్నారు. ట్రాఫిక్‌లోని ఆటో లను ఆపే సమయంలో 'రేయ్... ఆటో' అన్న వారి సంబోధన బాగా చదువుకొని మరో మార్గాంతరం లేక ఆటోలు నడుపుతున్న వారినే కాదు ఆటోల్లో కూర్చున్న ప్రయాణీకులకు కూడా కర్ణ కఠోరమనిపిస్తుంది. ముందు ట్రాఫిక్ పోలీసులకు కాస్త మర్యాద, మన్నన నేర్పే బాధ్యతను పోలీసు ఉన్నతాధికారులు స్వీకరిస్తే బాగుంటుందేమో!

## ముత్యాలమ్మకు మహా కుంభాభిషేకం

తూర్పు కనుపూరులోని ముత్యాలమ్మ మహాకుంభాభిషేక మహోత్సవాలు జూలై 1వ తేది నుండి 4వ తేది వరకు జరుగుతాయి. 1వ తేది కలశస్థాపన, అగ్ని ప్రతిష్ట, యాగ మంటపం పూజ జరుగుతాయి. 2వ తేది ఉత్సవమూర్తుల మహా స్నపనం, 3వ తేది జలాదివాసం, జీవ కళాన్యాసం కార్యక్రమాలుంటాయి. 4వ తేది ఉదయం మహా కుంభాభిషేక మహోత్సవాన్ని రాజ్యసభ సభ్యుడు నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి తన చేతుల మీదుగా ప్రారంభిస్తారు. దేవాదాయ శాఖామాత్యులు గాదె వెంకటరెడ్డి, జిల్లా ఇన్‌ఛార్జ్ మంత్రి మోపిదేవి వెంకటరమణ, పురపాలక శాఖా మంత్రి ఆనం రామనారాయణ రెడ్డి, జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి తిరుపతి ఎంపీ చింతామోహన్, దేవాదాయశాఖ కమీషనర్ జెఎస్‌వి ప్రసాద్, కలెక్టర్ రాంగోపాల్, గూడూరు ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్, కేంద్ర సహకార బ్యాంక్ ఛైర్మన్ వాకాటి నారాయణ రెడ్డి, యరటపల్లి జానకిరామిరెడ్డి, స్వామి రామానంద భారతి పాల్గొంటారు. అమ్మవారి భక్తులను ఈ మహోత్సవానికి తరలిరమ్మంటున్నారు ఆలయ కార్య నిర్వహణాధికారి కోవూరు జనార్దన్‌రెడ్డి.

కొరవ 14వ పేజీలో

## వెంకటగిరి రాజా కన్నుమూత!

వెంకటగిరి సంస్థానానికి చివరి జమీందారుగా వ్యవహరించిన వివిఆర్‌జికె (వెలుగోటి వెంకట వరదరాజ గోపాలకృష్ణ) యాచేంద్ర (86) 29తేది సాయంత్రం కన్నుమూశారు. కొంతకాలంగా అస్వస్థతతో హైదరాబాదు ఆస్పత్రిలో వున్నారాయన.

జమీందారీ రద్దు ఉద్యమం ఉధృతంగా సాగుతున్న రోజులలో యువరాజు హోదాలో రాచరిక విలాసాలన్నీ అనుభవించాడు యాచేంద్ర. ఆట, పాట, వేటలలో మునిగితేలాడు. ఆ మైకం నుంచి తేరుకోక ముందే, యుక్త వయస్సుకు చేరుకోక ముందే జమీందారీ విధానం రద్దయిపోయింది. అందువల్ల ఆయన గురించి జిల్లా ప్రజలకు పెద్దగా తెలియదు. ఆయనకూ ప్రజాసంబంధాలు చాలా తక్కువ. రాజ్యం పోయినా రాచరికపు తీరు మారకపోవడం ఆయన బలహీనత. వెంకటగిరితోపాటుగా జమీందారీ పెత్తనం చేసిన విజయనగరం, పొనగల్లు వంటి రాజాలు ప్రజలతో మమేకమై, రాజకీయంగా ఎంతో వున్నతి సాధించారు. కానీ యాచేంద్ర మాత్రం అతికష్టం మీద వెంకటగిరి ఎమ్మెల్యే పదవి సాధించి, దానితోనే సరిపెట్టుకొన్నాడు.

యాచేంద్రకు సత్యసాయిబాబా మీద భక్తి ఎక్కువ. తన పూర్వీకులు నిధి నిక్షేపాలను ఎక్కడో పాతరవేసి పెట్టి వున్నారన్న భ్రమలో వుండేవారాయన. వాటిని వెలికి తీయడానికి సత్యసాయిబాబా మహత్తులను వాడుకోవాలని చూశాడు. అందుకోసం రౌండ్ ప్యాలెస్ వంటి అద్భుత కట్టడాలను కూలదోయించారు. ఎన్నో భవనాలను త్రవ్వకాలతో పాడుపెట్టారు. కొంచెం పెద్ద మనసు చేసుకొని ఆ భవనాలను బడులు, కాలేజీల వంటి ప్రజోపయోగ కార్యక్రమాలకు దానమిచ్చి వుంటే యాచేంద్ర పేరు వెంకటగిరిలో స్థిరంగా నిలిచి వుండేది. కానీ అది జరగలేదు.

యాచేంద్రకు ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. వారి కుటుంబానికి మా సానుభూతి తెలియజేస్తున్నాము.

## హోమ్‌గార్డుల పోస్టులు అమ్ముకొన్నారు!



*విచారణలో డిపిఓలోని దోషులు తేలుతారు. (ఫైల్‌ఫోటో).*

నిరుద్యోగిత పెచ్చుపెరిగిన ఈ రోజుల్లో ప్రతి ఉద్యోగానికి డిమాండ్ పెరిగింది. పోలీసు శాఖకు అనుబంధంగా పనిచేసే హోమ్‌గార్డు ఉద్యోగమంటే ఎందువల్లో మోజు జాస్తి. దీన్ని పోలీసు ఉన్నతాధికారులు డబ్బు చేసుకోవడం జిల్లాలో సంచలనం సృష్టించింది. నెల్లూరులో ఈ మధ్య ఎకాఎకిన 30 హోమ్‌గార్డుల పోస్టులను జిల్లా పోలీసు ఉన్నతాధికారి రహస్యంగా భర్తీ చేశారు. దీనికిగాను ఒక్కొక్కరి నుంచి

### పోలీస్ శాఖలో వెలుగుచూసిన కుంభకోణం

లక్ష నుంచి లక్షన్నర వరకు వసూలు చేయడం సంచలనం సృష్టించింది. సహజంగా హోమ్‌గార్డుల పోస్టులు భర్తీ చేయాలంటే ప్రకటన జారీ చేయాలి. అనంతరం శారీరక ధారుఢ్య పరీక్షలు నిర్వహించి ఈ పోస్టులు భర్తీ చేయాలి. ఈ విధంగా చేసే సమయంలో ఒకటి రెండు పోస్టులను పోలీసు ఉన్నతాధికారులు తమకు ఇష్టమొచ్చిన వ్యక్తులకు ఇవ్వడం రివాజే. కానీ ఏకంగా 30 పోస్టులు భర్తీచేసిన వ్యవహారంపై రాష్ట్ర హోమ్ మంత్రి సబితా ఇంద్రారెడ్డి విచారణచేసి తనకు నివేదిక అందించమన్నంత వరకు ఎవరికీ తెలియకపోవడం కాస్త ఆశ్చర్య పరిచింది. తనకు ఈ విషయమై వచ్చిన తాఖీదు చూసి గుంటూరు రేంజ్ డిఐజి కూడా ఆశ్చర్యపోయినట్లు తెలిసింది. ఈ పోస్టులు ఎవరు చెప్పడం వల్ల భర్తీ చేశారన్న విషయమై 28వ తేది హైదరాబాద్‌లో జరిగిన విచారణకు హోమ్ గార్డ్ డిఎస్పీ నాగేశ్వరరావు, ఆర్‌ఐ లక్ష్మణరావు, ఆర్మ్‌డ్ రిజర్వు ఆర్‌ఐ చెంచురెడ్డి హాజరైనట్లు తెలిసింది. మొత్తం మీద జిల్లా పోలీసు విభాగంలో హోమ్ గార్డుల పోస్టుల భర్తీలు సంచలనం సృష్టించాయి. ఈ వ్యవహారమై అంతిమంగా ఎవరిపై వేటు పడుతుందనేది వచ్చేవారం వరకు వేచి చూడాల్సిందే!

## ఎంజి బ్రదర్స్ క్రొత్త వెంచర్ రాయల్‌సిటీ

వాహనాల అమ్మకాల్లో పేరుగాంచిన ఎంజి బ్రదర్స్ సంస్థ రియల్‌ఎస్టేట్ రంగంలోకి ప్రవేశించి అక్కడా విజయాలను సొంతం చేసుకొన్న సంగతి తెలిసిందే. క్రొత్తగా చిల్లకూరు మండలం పాలిచెర్లవారిపాళెం సమీపంలో రాయల్ సిటీ పేరుతో క్రొత్త వెంచర్‌ను ప్రారంభించింది. షుమారు 60 ఎకరాల్లో ఏర్పాటుచేస్తున్న వెంచర్‌కు జూన్ 18న భూమి పూజ చేశారు. దీనికి సంబంధించిన బ్రోచర్‌ను విడుదల చేశారు. ఈ సందర్భంగా ఎంజి బ్రదర్స్ అధినేత ఎంఆర్ గంగాధర్ మాట్లాడుతూ ఆటోమొబైల్ రంగంలోనే కాక, రియల్ ఎస్టేట్ నందు ఆదరిస్తున్న ఖాతాదారులకు కృతజ్ఞతలు తెలిపారు. ఈ కార్యక్రమంలో సంస్థ డైరక్టర్లు రాఘవేంద్ర, గోపాల కృష్ణ, వేమిరెడ్డి సుందరరామిరెడ్డి, చిల్లకూరు పట్టాభిరెడ్డి, సర్పంచ్ వెంకట కృష్ణారెడ్డి, కృష్ణ, రెడ్డప్ప, శివాజీ తదితరులు పాల్గొన్నారు.


*గూడూరు - వరగలి రోడ్డులో పాలిచెర్లపాళెంలో నూతనంగా ఏర్పాటుచేసిన యంజిబ్రదర్స్ రాయల్‌సిటీ బ్రోచర్‌ను విడుదల చేస్తున్న యంజి బ్రదర్స్ అధినేత గంగాధర్.*

## కళ తప్పిన ఫండ్ ఆఫీసు

**షాపింగ్ కాంప్లెక్స్‌గా మారిన చారిత్రాత్మక భవనం**

నెల్లూరు కలెక్టరేట్‌కు ఎదురుగా దానికంటే ఎత్తుగా వుండే ఫండ్ ఆఫీసు భవనం అందరినీ ఆకర్షించేది. ఎంతో చరిత్ర వున్న ఈ భవనాన్ని పడగొట్టి ఇటీవల షాపింగ్ కాంప్లెక్స్‌ను నిర్మించారు. ఈ షాపింగ్ కాంప్లెక్స్‌లో భాగంగానే ఫండ్ ఆఫీసు ఒక రూమ్‌లో కార్యకలాపాలు నిర్వహించడం పాతతరం వారిని మనసు క్షోభిల్లేట్లు చేస్తుంది. 1888 సంవత్సరం తొమ్మిది మంది డైరక్టర్లతో ఫండ్ ఆఫీసు కమిటీ ఏర్పడింది. ప్రజలు, వ్యాపారస్తులు, ఉద్యోగుల నుంచి డిపాజిట్లు వసూలు చేసేది. నమ్మకానికి మారు పేరుగా వుండడంతో వ్యాపారం బాగానే వుండేది. 122 సంవత్సరాల చరిత్ర కలిగిన ఈ ఫండ్ ఆఫీసులో గతంలో ఎన్నో సమావేశాలు, పెళ్లిళ్లు, రిసెప్షన్లు జరిగిన చరిత్ర కూడా వుంది. అటువంటి చోట చారిత్రక భవనాన్ని పగులగొట్టి తొమ్మిది అంగళ్లతో కాంప్లెక్స్‌ను నిర్మించి బాడుగులకు ఇచ్చారు. ఇప్పటి నిర్వాహకులు ఫండ్ ఆఫీసులో ఏ మేర నగదు డిపాజిట్లు వున్నాయి? షాపుల ద్వారా నెలసరి అద్దెలు ఏ మేరకు వసూలవుతున్నాయన్న వివరాలు వెల్లడించను ఇష్టం పడదం లేదు. ప్రస్తుతం ఫండ్ ఆఫీసు అనబడే షాపింగ్ కాంప్లెక్స్‌కు సత్యనారాణమూర్తి ఛైర్మన్‌గా, సిఎస్‌వి సుబ్రహ్మణ్యం కార్యదర్శిగా, ముగ్గురు కార్యాలయ సిబ్బంది పనిచేస్తున్నారు. పాతతరం ఊహల్లో మాత్రం ఫండ్ ఆఫీసు ఎప్పటికీ మిగిలి పోతుందనడం ఖాయం.


*ఫండ్ ఆఫీస్ స్థానంలో వెలసిన షాపింగ్ కాంప్లెక్స్.*

## భ్రూణ హత్యల నివారణకు చర్యలు!

జిల్లాలో భ్రూణ హత్యలు నివారించి తద్వార భవిష్యత్తులో లింగ నిష్పత్తి భేదాలను నివారించడానికి రూపొందించిన చట్టాన్ని కఠినంగా అమలు పరిచేందుకు వైద్య ఆరోగ్య శాఖ చర్యలు చేపట్టింది. 2001 సంవత్సరం నుంచి అమలులో వున్న గర్భస్థ పిండ పరీక్ష ప్రక్రియ చట్టం 1994 గూర్చి జిల్లావ్యాప్తంగా ప్రచారం చేయను నడుం బిగించింది. ప్రభుత్వ, ప్రైవేటు ఆసుపత్రులలో స్కానింగ్ సెంటర్లలో లింగ నిర్ధారణ గూర్చి తెలియజేయడం నేరంగా పరిగణిస్తారు. ఈ విధంగా చేసిన వారికి మొదటి దఫా మూడు సంవత్సరాల జైలు శిక్షతోపాటు పదివేలు జరిమానా విధిస్తారు. రెండవ దఫా నేరం చేస్తే ఐదేళ్ల జైలు శిక్ష 50వేలు జరిమానా విధించే విధంగా చట్టాన్ని పదును పెట్టారు. జిల్లా వైద్య ఆరోగ్య శాఖ ఆధ్వర్యంలో జిల్లాలో ఏర్పాటుచేసి వున్న స్కానింగ్ సెంటర్లను గుర్తించారు. 143 సెంటర్లకు రిజిస్ట్రేషన్ వుంది. రిజిస్ట్రేషన్ లేకుండా ఆస్పత్రుల్లో వున్న స్కానింగ్ సెంటర్లను సైతం రిజిస్ట్రేషన్లు చేయించుకోమని నోటీసులు జారీ చేశారు. జిల్లా ఉప వైద్య ఆరోగ్య శాఖాధికారి డాక్టర్ దశరధరామయ్య నేతృత్వంలోని కమిటీ భ్రూణ హత్యల నివారణకు కఠినంగానే పనిచేస్తామంటుంది. కేసుల నమోదు తీవ్రత బట్టే వీరి పనితీరును అంచనా వేయాలి మరి!

## గాడి తప్పిన వసతి గృహాలు

**సరిగ్గా డ్యూటీచేయని వార్డన్లు, మ్యాట్రిన్లు**

విద్యార్థుల సంక్షేమానికి కృషి చేయాల్సిన సంక్షేమ శాఖ అధికారులు ఇష్టారాజ్యంగా వ్యవహరిస్తుండడంతో వసతి గృహాల పర్యవేక్షణ గాడి తప్పింది. విద్యార్థులను కన్నబిడ్డల్లా చూసుకోవాల్సిన వార్డెన్లు అవినీతికి పాల్పడుతూ విద్యార్థుల నోళ్లు కొట్టి సంపాదిస్తుండడంతో హాస్టళ్లలో చదివే విద్యార్థులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. సాంఘిక సంక్షేమ శాఖ ఆధ్వర్యంలో 149 వసతి గృహాలు, బిసి హాస్టళ్లు 76, ప్రత్యేక వసతి గృహాలు వున్నాయి. వీటి నిర్వహణను సహాయ సంక్షేమాధికారులు పర్యవేక్షించాల్సి వుంటుంది. విద్యార్థుల స్కాలర్ షిప్పులు, కాస్మొటిక్ ఛార్జీలను సక్రమంగా అందేలా ఎఎస్‌డబ్ల్యుఓలు చూడాలి. వీరు స్థానికంగా కాపురం వుండక నగరాల్లో వుంటూ చుట్టపుచూపుగా హాస్టళ్లను పర్యవేక్షిస్తుండడంతో వార్డెన్లు చేతివాటం ప్రదర్శిస్తూ విద్యార్థులను దోచుకతింటున్నారు. కోవూరు, ఇందుకూరుపేట, పొదలకూరు, సూళ్లూరుపేట, ఆత్మకూరు మండలాల్లో వుండాల్సిన ఎఎస్‌డబ్ల్యుఓలు స్థానికంగా వుండకుండా నామమాత్రంగా మండల కేంద్రాల్లో ఒక గదిని అద్దెకు తీసుకుని నివాసం వుంటున్నట్లు ఉన్నతాధికారులను మభ్యపెడుతున్నారు. దీన్ని అవకాశంగా చేసుకొని వార్డెన్లు పేట్రేగిపోతున్నారు. పిల్లలకు సరైన ఆహారం అందించకుండా పాచిపోయిన నాసిరకం ఆహారాన్ని అందిస్తుండడంతో హాస్టల్ విద్యార్థులు అనారోగ్యానికి గురౌతున్నారు. అల్లూరు హాస్టల్‌లో విద్యార్థులు కలుషిత ఆహారం తిని అనారోగ్యం బారిన పడడానికి అవినీతి పరులైన వార్డెన్లు, వంట మనుషులు చేస్తున్న నీచపువనులే కారణమన్నది తెలిసిన సంగతే. ఇప్పటికైనా హాస్టళ్ల పర్యవేక్షణాధికారులను, వార్డెన్లను గాడిలో పెట్టి విద్యార్థుల సంక్షేమాన్ని చూడాల్సిన బాధ్యత జిల్లా ఉన్నతాధికారులపై వుంది.



*మందలించినా తీరుమారని నెల్లూరు బిసి బాలుర హాస్టల్. (ఫైల్‌ఫోటో).*

## తీరుమారని పెద్దాసుపత్రి

ఎందరు ఎన్నిసార్లు తనిఖీలు చేసినా, మరెన్ని హెచ్చరికలు చేసినా, చీవాట్లు పెట్టినా, చీదరించుకొన్నా పెద్దాసుపత్రి వైద్యుల తీరు మారడం లేదు. ఆస్పత్రికి వచ్చే రోగులంటే ఏమాత్రం కనికరం లేకుండా, మనిషన్న విషయాన్ని విస్మరించినట్లుగా ఆస్పత్రి వైద్యులు, అధికారులు ప్రవర్తిస్తున్న తీరు పట్ల సర్వత్రా నిరసన వ్యక్తమౌతోంది. ముఖ్యంగా జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి ఇప్పటికి కొన్ని వందలసార్లు ఆస్పత్రిని తనిఖీ చేసి వుంటారు. తనిఖీ చేసిన ప్రతి సారి డాక్టర్లకు సుతిమెత్తని మందలింపుల నుంచి తీవ్ర హెచ్చరికలు ఎన్నో జారీ చేసి వున్నారు. అయినా ఎప్పటికప్పుడు ఆస్పత్రి వైద్యాధికారులు తమకేమీ పట్టనట్లుగా వ్యవహరించడం చూస్తుంటే దున్నపోతు మీద వర్షం కురిసిన చందంగా వుంది తప్ప రోగులకు తగిన చికిత్స అందించాలన్న కనీస బాధ్యత వారిలో కలుగకపోవడం వైద్య వృత్తికే కళంకం తెచ్చేలా వుంది. ఆస్పత్రి పరిశుభ్రత విషయంలో కానీ, ఎక్స్-రే మిషన్లు, మందులను రోగులకు అందుబాటులో వుంచడంలో కాని అత్యంత నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారు. ఇటీవల బిజెపి రాష్ట్ర శాఖ అధ్యక్షుడు కిషన్‌రెడ్డి జిల్లా పర్యటన సందర్భంగా ఆస్పత్రిని తనిఖీ చేసిన సందర్భంలో అక్కడి వాతావరణాన్ని చూసి చలించిన ఆయన ఆస్పత్రి వైద్యులపై ఆగ్రహం వ్యక్తం చేశారు.

# సిమెంటు రోడ్ల పేరిట స్వాహాకు రంగం సిద్ధం!



చెక్కుచెదరని చిల్డ్రన్స్ పార్కు రోడ్డుపైనే రోడ్డు వేయను కోట్ల రూపాయలు మంజూరయ్యాయి.

**నెల్లూరు కార్పొరేషన్ పరిధిలోని ఎనిమిది రోడ్ల నిర్మాణానికి విడుదల చేసిన 15కోట్ల రూపాయల నిధులను పాలకులు ఒక పథకం ప్రకారం స్వాహా చేయను రంగం సిద్ధం చేసారన్న దానికి ఎంపిక చేసిన రోడ్లు సజీవ సాక్ష్యాలుగా పేర్కొనవచ్చు.**

నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్ పరిధిలో కొత్తగా నిర్మించనున్న సిమెంటు, తారురోడ్ల పనుల మంజూరు వివాదాస్పదంగా మారింది. రోడ్ల నిర్మాణ ప్రతిపాదనలను ఎవరికి తెలియకుండా ఇంజనీరింగ్ విభాగం అధికారులు తయారు చేయడంలో అనేక అవకతవకలు చోటు చేసుకున్నాయి. తయారు చేసిన ప్రతిపాదనలను ప్రభుత్వానికి పంపడం, నిధులు మంజూరైన తర్వాత కౌన్సిల్ సమావేశాల్లో ప్రవేశపెట్టడం జరిగింది. ఇలా చేయడం వల్ల కొంతమంది కార్పొరేటర్లు అధికారుల వైఖరిని తప్పుబట్టారు. మేయర్ అండతోనే ఈ ప్రతిపాదనలు రూపుదిద్దుకొన్నాయన్న అభిప్రాయం అందరి మదిలో మెదలుతుంది. ప్రజలకు అవసరమున్న చోట సిమెంటు రోడ్లు నిర్మించకుండా అవసరం లేని ప్రాంతాల్లో సిమెంటురోడ్ల నిర్మాణానికి అనుమతి ఇచ్చారన్న విమర్శలున్నాయి. రెండు, మూడు సంవత్సరాల క్రితం నిర్మించిన రోడ్ల స్థానంలోనే తిరిగి రోడ్లనిర్మాణం చేపట్టేందుకు సన్నాహాలు జరుగుతున్నాయి. కొంతమంది కాంట్రాక్టర్లకు ఆర్థికంగా లబ్ది చేకూర్చిపెట్టేందుకే సిమెంటు రోడ్ల నిర్మాణం చేపట్టారు.

## చాలాచోట్ల అధ్వాన్నం

నెల్లూరు నగరంలో 50 మునిసిపల్ డివిజన్లలోని పలు ప్రాంతాల్లో రోడ్లు చాలా అధ్వాన్నంగా వున్నాయి. వీటి గురించి ఏమాత్రం పట్టించుకోని కార్పొరేషన్ పాలకవర్గం, అధికారులు రాజకీయ ప్రయోజనాల కోసం ప్రజాప్రతినిధులు సూచించిన రోడ్లనే సిమెంటు రోడ్లుగా మార్చేందుకు ప్రయత్నాలు చేశారు. నగరంలో త్రాగునీరు, డ్రైనేజీ, పారిశుధ్యం, వీధిలైట్ల సమస్యలు అనేకం వున్నప్పటికి వీటిని పరిష్కరించేందుకు శ్రద్ధ చూపడం లేదు. సిమెంటు, తారురోడ్ల నిర్మాణాలకు సంబంధించి ప్రతిపాదనలు తయారుచేస్తే ముడుపులు అందుతాయన్న వుద్దేశ్యంతోనే కార్పొరేషన్ ఇంజనీరింగ్ విభాగం అధికారులు అవసరం లేని చోట కూడా రోడ్ల నిర్మాణాలకు ప్రతిపాదలను తయారుచేసి విమర్శలు ఎదుర్కొన్నారు.

మునిసిపల్ శాఖ నుంచి ఈ రోడ్ల నిర్మాణాలకు నిధులు కేటాయించడం జరిగింది. కార్పొరేషన్ సాధారణ నిధుల నుంచి ఒక్క రూపాయి కూడా ఇందుకు కేటాయించే అవకాశం లేదు. ఇప్పటికే మూలాపేటలోని అలంకార్ సెంటర్ – సిఏఎం హైస్కూలు రోడ్డును కొంతమేర సిమెంటురోడ్డుగా మార్చబడింది. ఈ రోడ్డు కూడా కాంగ్రెస్ పార్టీకి చెందిన కార్పొరేటర్ బినామి పేరుతో పనులు పూర్తిచేసి బిల్లులు మంజూరు చేయించుకున్నాడు. ఈరోడ్డు నిర్మాణం కోసం కార్పొరేషన్ రూ. 26 లక్షల రూపాయలను మేయర్ భానుశ్రీ ముందుగానే మంజూరు చేశారు. ఈ అంశం గతంలో వివాదంగా మారింది. ఈ రోడ్డు నిర్మాణం కోసం వినియోగించిన మెటీరియల్ నాసిరకంగా వుందన్న ఆరోపణలు వున్నాయి. రాష్ట్ర పురపాలశాఖ మంత్రి ఆనం రామనారాయణరెడ్డి చేతుల మీదుగా ఈరోడ్డును ప్రారంభింప చేయడం జరిగింది. ప్రారంభోత్సవ సమయంలో కూడా రోడ్డు మొత్తం ఎందుకు పూర్తి చేయలేదని కార్పొరేషన్ అధికారులను మంత్రి ప్రశ్నించారు. దీంతో నీళ్లు నమిలిన అధికారుల త్వరలోనే పనులు చేపడుతామని చెప్పారు. ఇప్పటికి నెలలు గడచిపోతున్నా దీన్ని గురించి పట్టించుకోవడం లేదు. ఈ రోడ్డు వహాబ్‌పేట జంక్షన్ వరకు వేయాల్సి వుండగా కేవలం సిజర్ కంపెనీ వరకే నిర్మించి మిగిలిన భాగాన్ని వదిలివేశారు. ఇలా చేయడం వల్ల రాకపోకలకు నిత్యం అంతరాయం ఏర్పడుతుంది.

## రూ.15 కోట్లు విడుదల

మునిసిపల్ కార్పొరేషన్ పరిధిలో ఎనిమిది రోడ్ల నిర్మాణాలు చేపట్టేందుకు రూ.14కోట్ల, 90లక్షల, 19వేల రూపాయలు కేటాయించడం జరిగింది. డైరెక్టర్ ఆఫ్ మునిసిపల్ అడ్మినిస్ట్రేషన్ కమిషనర్ 2008–09 ఆర్థిక సంవత్సరానికి సంబంధించిన గ్రాంట్ల క్రింద మార్చి నెలలో రూ.3కోట్ల 51లక్షల 65వేలు విడుదల చేశారు. ఈ నిధులతో మినిబైపాస్‌రోడ్డు నుండి రవాణాశాఖ కార్యాలయం మీదుగా కొండాయపాళెంలోని ప్రాథమిక పాఠశాల వరకు తారు రోడ్డు నిర్మించనున్నారు. ఇందుకు రూ.2కోట్ల50లక్షలు కేటాయించారు. అలాగే విజయమహల్ గేటు నుండి వి.ఆర్.చిల్డ్రన్స్ అకాడమి వరకు సిమెంటురోడ్డు నిర్మాణం కోసం ఒక రూ.కోటి లక్షా 65వేల రూపాయలు కేటాయించారు.

పై రెండు పనులకు సంబంధించి టెండర్లను ఖరారు చేసే ప్రక్రియ జరుగుతుంది. ఇంతకు ముందు విజయమహల్‌గేటు నుంచి వి.ఆర్ చిల్డ్రన్స్ అకాడమి వరకు సిమెంటు కాంక్రీట్‌రోడ్డు నిర్మాణం చేపట్టారు. అయితే ఈ రోడ్డును నాసిరకంగా నిర్మించడంతో మధ్య మధ్యన గుంటలు ఏర్పడి రాకపోకలకు ఇబ్బందికరంగా పరిణమించింది. ఈరోడ్డు మధ్యలో ఏర్పడిన గుంటలు పూడిస్తే సరిపోయేదానికి కోటిరూపాయలకు పైగా ఖర్చు చేస్తున్నారు. మునిసిపల్ కార్పొరేషన్ అధికారిక పాలకపక్షంలోని కొందరు కార్పొరేటర్ల కోరిక మేరకు ఈ రోడ్డు నిర్మాణం చేపట్టేందుకు ఇంజినీరింగ్ విభాగం అధికారులు ప్రతిపాదనలు తయారుచేసి నిధులు మంజూరు చేయించారు. వి.ఆర్ విద్యా సంస్థలకు ప్రయోజనం కలిగించేందుకు ఈ రోడ్డు నిర్మాణం చేపడుతున్నారనే ప్రతిపక్షాలకు చెందిన కార్పొరేటర్లు విమర్శిస్తున్నా పట్టించుకునే నాధుడే లేకుండా పోయారు.

ఇదిలా వుండగా 2009 సంవత్సరం అక్టోబర్ నెలలో కురిసిన భారీ వర్షాలకు జాతీయరహదారిని కలిపే ఆరు రోడ్లు దెబ్బతిన్నట్లు అధికారులు గుర్తించారు. ఈ ఆరు పనులకు రూ.14కోట్ల 90లక్షల 19వేల రూపాయల నిధులు మంజూరయ్యాయి. కార్పొరేషన్ పరిధిలోని పడారుపల్లి మెయిన్‌రోడ్డు నుంచి జాతీయరహదారి మినిబైపాస్ రోడ్డు వరకు తారురోడ్డు వేసేందుకు ప్రతిపాదనలు తయారు చేశారు. ఇందుకు రూ.కోటి18లక్షల 89వేల రూపాయలు కేటాయించడం జరిగింది. రామలింగాపురం కూడలిలోని మినిబైపాస్‌రోడ్డు నుంచి చిన్నపిల్లల పార్కు మీదుగా జాతీయరహదారి వరకు సిమెంటు రోడ్డు నిర్మాణం చేపట్టేందుకు 7కోట్ల 41లక్షల రూపాయలు కేటాయించారు.

కొండాయపాళెం రైల్వేగేటు నుంచి వనంతోపు మీదుగా పాత కొండాయపాళెం వరకు తారురోడ్డు నిర్మించేందుకు రూ.కోటి 60లక్షలు కేటాయించారు. మైపాడు గేటు సమీపంలోని రోడ్డు నుంచి రైస్ మిల్లులు, ఆర్.సి.సి ఫ్యాక్టరీ మీదుగా జాతీయ రహదారి వరకు తారు రోడ్డు నిర్మాణం చేపట్టేందుకు రూ.2కోట్ల 17లక్షల 52వేల రూపాయలు కేటాయించడం జరిగింది. చింతారెడ్డిపాళెం రోడ్డు నుంచి పాత అపోలో ఆసుపత్రి కూడలి మీదుగా ముత్తుకూరు రోడ్డు వరకు తారు రోడ్డు నిర్మించేందుకు రూ.42లక్షల 50వేలు కేటాయించారు. జాతీయ రహదారి నుంచి వేణుగోపాలస్వామి కళాశాల, పద్మావతినగర్, పుట్ట వీధుల మీదుగా బాలాజీనగర్ వరకు తారురోడ్డు నిర్మించేందుకు రూ.2కోట్ల 16లక్షలు కేటాయించారు.

పై ఆరు పనులకు సంబంధించి టెండర్లు కూడా ఖరారు చేయడం జరిగింది. అపోలో ఆసుపత్రిరోడ్డు, బాలాజీనగర్‌రోడ్డు, కొండాయపాళెం – వనంతోపురోడ్డు నిర్మాణం, పడారుపల్లి జాతీయ రహదారి రోడ్డు నిర్మాణ పనులకు శ్రీహరిరెడ్డి అనే కాంట్రాక్టర్ దక్కించుకున్నాడు. మిగిలిన రెండు పనులకు మహేష్‌రెడ్డి, ఆర్‌వి. కన్‌స్ట్రక్షన్స్ అధినేత రాజగోపాల్ దక్కించుకున్నారు. టెండర్లు ఖరారు చేసే క్రమంలో కూడా అధికారపార్టీకి చెందిన నేతలు తమ అధికార పలుకుబడిని వుపయో గించినట్లు ప్రచారం జరుగుతుంది. మొత్తం మీద ఈ పనులకు సంబంధించి ప్రతిపాదనలు తయారు చేయడం దగ్గర నుంచి టెండర్లు ఖరారు చేసే వరకు లక్షలాది రూపాయలు చేతులు మారాయి.



నెల్లూరు హెడ్ పోస్టాఫీసులో జరిగిన 'ప్రతిభ పురస్కార' కార్యక్రమంలో మాట్లాడుతున్న పోస్టల్ సూపరింటెండెంట్ ఎస్వీ శివప్రసాద్. ప్రక్కన పోస్టల్ అసిస్టెంట్ సూపరింటెండెంట్ కె.శ్రీనివాస్, ఐ.ఆర్.కె.నాయుడు.

# సెజ్‌లలో శ్రమ దోపిడీ!

**సిఐటియు నాయకుడు అజయ్ ఆరోపణ**

ప్రత్యేక ఆర్థిక మండళ్ల ద్వారా ఏర్పాటైన పరిశ్రమల యాజమాన్యాలు కార్మికుల శ్రమను దోపిడీ చేస్తున్నాయని సిఐటియు రాష్ట్ర ఉపాధ్యక్షులు పి.అజయ్‌కుమార్ ఆరోపించారు. సూళ్లూరుపేటకు వచ్చిన ఆయన చుట్టు ప్రక్కల ఏర్పాటైన సెజ్‌లు, వివిధ పరిశ్రమలను పరిశీలించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ప్రభుత్వపరంగా పలురకాల లబ్ధిపొందుతున్న పరిశ్రమల యాజమాన్యాలు కష్టపడి పనిచేసే కార్మికులకు మాత్రం కనీసవేతనాలు చెల్లించడం లేదన్నారు. పరిశ్రమ స్థాపించిన యజమాన్యానికి ఐదేళ్ల వరకు ఆదాయ పన్ను మినహాయింపుతోపాటు అనేక మౌలిక సదుపాయాలను ప్రభుత్వం కల్పిస్తుందన్నారు. ఇంత చేస్తున్నా పరిశ్రమల నిర్వాహకులు కార్మికుల గురించి పట్టించుకోవడం లేదని, ప్రభుత్వం కార్మికుల సంక్షేమాన్ని విస్మరిస్తున్నదని విమర్శించారు. టాటా ఐరన్ ప్లేట్స్, విజన్ పవర్ టెక్ ఫ్యాక్టరీలో రెగ్యులర్ ఉద్యోగులను నియమించకుండా ఎక్కువ మందిని కాంట్రాక్ట్ కార్మికులుగా తీసుకొంటున్నారని, ఇది సరైన విధానం కాదన్నారు. నెలలో ఒక రోజుకు మించి కార్మికులు సెలవుపెడితే అటెండెన్స్ బోనస్‌ను రద్దు చేస్తున్నారని ఆరోపించారు. ప్రైమ్ ఎలక్ట్రికల్ ఫ్యాక్టరీ నిర్మాణంలో స్థానికేతరులకే అధిక ప్రాధాన్యమిస్తూ స్థానికులను విస్మరిస్తున్నారని తెలిపారు. ఇంతగా పరిశ్రమల యాజమాన్యాలు కార్మికులకునష్టంకలిగిస్తున్నా కార్మికశాఖాధికారులు పట్టించుకోకుండా నామమాత్రపు తనిఖీలు చేస్తున్నారని విమర్శించారు.



కిరోసిన్, గ్యాస్ సిలిండర్ ధరల పెంపుదలను నిరసిస్తూ నెల్లూరు వెంకటేశ్వరపురంలోని జనార్ధన్‌రెడ్డి కాలనీలో నడిరోడ్డుపై కట్టెలపొయ్యిపై వంట చేస్తున్న మహిళ.

# మత్స్యకారేతరుల పరిహారంపై రగడ

**● ముత్తుకూరులో తాజా వివాదం**

ముత్తుకూరు మండలంలో నిన్న మొన్నటి వరకు మత్స్యకారులకు పరిహారం పంపిణీ చేయడంలో వివక్షత చూపుతున్నారంటూ పలుగ్రామాల మత్స్యకారులు ఆందోళనలు, ధర్నాలు చేపట్టడం తెలిసిందే. ఇప్పుడు మత్స్యకారేతరులకు పరిహారం అందజేయడంలోనూ అవకతవకలు జరిగాయంటూ ఆయ గ్రామాల ప్రజలు నిరసిస్తున్నారు. లబ్ధిదారుల ఎంపికకు సంబంధించి ముత్తుకూరు పంచాయితీ కార్యాలయంలో ఏర్పాటుచేసిన గ్రామసభలో గందరగోళం నెలకొంది. గ్రామసభకు హజరైన జనం లబ్ధిదారుల ఎంపికలో అవకతవకలు జరిగాయంటూ గ్రామసభను బహిష్కరించి తహశీల్దార్ ఉమాదేవిని ఘొరావ్ చేశారు. సభను సజావుగా జరగనివ్వాలని, అభ్యంతరాలు తెలుపవచ్చని తహశీల్దార్ కోరినా ఫలితం లేకుండా పోయింది. కృష్ణపట్నం పోర్టు పరిసర గ్రామాల్లో వున్న గిరిజనులు, దళితులు అధికశాతం చేపలవేటపైనే జీవనం సాగిస్తున్నందున వారికే పరిహారం అందజేయాలని ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి కలెక్టర్‌తో చర్చించిన మీదట పోర్టు యాజమాన్యం అందుకు సమ్మతించి ఆరు గ్రామాల్లోని మత్స్యకారేతరుల వివరాలు సేకరించి వారికోసం 19 కోట్లు మంజూరు చేసింది. అయితే ముత్తుకూరులో లబ్ధిదారుల జాబితాలో కేవలం 494 మంది పేర్లు వుండడం అందులో గిరిజనులు, దళితుల పేర్లు లేకపోవడంతో వివాదం నెలకొనింది. మత్స్యకారేతరుల గుర్తింపులో నిబంధనల ప్రకారం నడుచుకోవాలని, అందరికి న్యాయం చేయాలని స్థానికులు పట్టుబట్టారు. దీంతో తహశీల్దార్ ఈ విషయాన్ని కలెక్టర్ దృష్టికి తీసుకొనిపోయి న్యాయం చేస్తాననడంతో వివాదం సద్దుమణిగింది.





నెల్లూరు తిక్కన రచయితల సంఘం ఆధ్వర్యంలో జరిగిన కవి సమ్మేళనంలో కవయిత్రి దొరతి. వేదికపై పాయసం సుబ్రహ్మణ్యం, ఆచార్య ఆదిత్య, మురళీమోహన్‌రాజు, ఆర్వీ శేషయ్య నాయుడు.

# కసవరాజుకు దైవసేవ!

**మూడు ఆలయాలకు ధర్మకర్తగా నియామకం**

ఆలయాలకు వ్యవస్థాపక ధర్మకర్తలుగా పలువురు బాధ్యతలు చేపడుతుంటారు. అయితే ఎవరికీదక్కని అరుదైన అవకాశం రిటైర్డ్ స్టేట్‌బ్యాంక్ మేనేజర్ కసవరాజు రామ్మూర్తికి దక్కింది. అది కావలి పట్టణంలోని మూడు ఆలయాలకు వ్యవస్థాపక ధర్మకర్తగా వ్యవహరించడం. కావలి గ్రామదేవత శ్రీ కళుగోళ శాంభవి, విష్ణాలయం, రుద్రపాదక్షేత్ర శ్రీదుర్గాభ్రమరాంబదేవి సమేత మల్లేశ్వరస్వామి ఆలయాలు మూడింటికి వ్యవస్థాపక ధర్మకర్తగా బాధ్యతలు చేపట్టారు. ఆయన చేత దేవాదాయ శాఖాధికారి సుబ్రహ్మణ్యం ప్రమాణస్వీకారం చేయించారు. ఈ సందర్భంగా మూడు ఆలయాల్లో ప్రత్యేక పూజలు నిర్వహించిన కసవరాజు వెంట ధర్మకర్త, విశ్వోదయ విద్యాసంస్థల రెక్టార్ దొడ్ల వినయకుమార్‌రెడ్డి, బలరామిరెడ్డి, న్యాయవాదులు జానకిరామయ్య, నరసింహాచార్యులు, ప్రముఖ సాహితీవేత్త దీపాల రాధాకృష్ణమూర్తి తదితరులు పాల్గొన్నారు.

# పల్లెల్లో ప్రబలుతున్న అతిసార

**చలనం లేని వైద్యఆరోగ్య శాఖ**

సీజనల్ వ్యాధులతో పల్లెలు వణికిపోతున్నాయి. ముఖ్యంగా గ్రామాల్లో పారిశుధ్యం క్షీణించడంతో జిల్లావ్యాప్తంగా పలు ప్రాంతాల్లో అతిసార విజృంభిస్తోంది. ఉదయగిరి, కావలి, గూడూరు, అల్లూరు, పొదలకూరు, ఇందుకూరుపేట, నెల్లూరు తదితర ప్రాంతాల్లో పలువురు ప్రజలు అతిసారబారిన పడుతున్నప్పటికీ వైద్యసేవలు సక్ర మంగా అందకపోవడంతో అంటువ్యాధులు అదుపులోకి రావడం లేదు. ఉదయగిరి ప్రాంతంలో ఈ పరిస్థితి అధికంగా వుంది. ఉదయగిరితోపాటు సీతారాంపురం, దుత్తలూరు, వరికుంటపాడు, వింజమూరులో అతిసార విజృంభిస్తుండడంతో పిల్లలు, పెద్దలు వ్యాధిబారిన పడి ఆస్పత్రుల పాలవుతున్నారు. పలు గ్రామాల్లో పారిశుధ్యం అస్తవ్యస్తంగా వుండడం, మురుగునీరు పారుదలలేక వీధుల్లో నిలబడిపోవడంతో మురికి కూపాలుగా మారాయి. దీనికి తోడు త్రాగునీటి పైపుల్లో కలుషిత నీరు వచ్చి చేరుతుండడంతో ఆ నీటిని త్రాగిన ప్రజలు రోగాలకు గురౌతున్నారు. జిల్లాలో అతిసార చాపక్రింద నీరులా ప్రబలుతున్నప్పటికీ వైద్య ఆరోగ్య సిబ్బంది, పంచాయితీ సిబ్బంది తీసుకొంటున్న చర్యలు నామ మాత్రంగా వుంటుండడంతో రోజురోజుకు ఈ వ్యాధిగ్రస్తుల సంఖ్య ఎక్కువవుతోంది.



కిరోసిన్, గ్యాస్ సిలిండర్ ధరల పెంపుదలను నిరసిస్తూ నెల్లూరు గాంధీబొమ్మ వద్ద కట్టెలపొయ్యిపై వంట చేస్తున్న బిజెపి మహిళా మోర్చా నాయకురాళ్లు.



ధనలక్ష్మీపురంలోని సత్యంజీ గార్డెన్స్‌లో, ముంగమూరు యూత్ ఆధ్వర్యంలో నిర్వహించిన జిల్లాస్థాయి వాలీబాల్ పోటీలను ప్రారంభిస్తున్న నెల్లూరు సిటీ ఎమ్మెల్యే శ్రీధరకృష్ణారెడ్డి. ప్రక్కన ద్వారకనాథ్, టోర్నీ నిర్వాహకుడు ముంగమూరు యశ్వంత్‌రెడ్డి.

● ముత్తుకూరులో

# కోరలు చాస్తున్న కాలుష్యం!

### ప్రజలకు దిక్కెవరు?

ముత్తుకూరు మండలం పరిశ్రమల కేంద్రంగా ఒకవైపు అభివృద్ధి చెందుతుంటే, మరోవైపు అంతే వేగంగా కాలుష్యకోరల్లో చిక్కుకొంటున్నది. కృష్ణపట్నం పోర్టు ఏర్పాటుతో ముడిఇనుము, బొగ్గు ఎగుమతి, దిగుమతి జరుగుతుండడంతో వాతావరణ కాలుష్యం ఏర్పడిందని ఈ ప్రభావం ఇక్కడి ఉప్పు పరిశ్రమపై తీవ్రంగా వుందని వ్యాపారస్తులు వాపోతున్నారు. గోపాలపురం సాల్ట్‌ఫ్యాక్టరీలో తయారయ్యే ఉప్పును కొనుగోలు చేసేవారు వ్యాపారులు. పోర్టులో కార్యకలాపాలు ఊపందుకొన్న నాటి నుంచి ఇక్కడ తయారుచేసే ఉప్పులో ముడి ఇనుము కలిసి ఎర్రగా మారడంతో ఈ ఉప్పును కొనేందుకు వ్యాపారస్తులు ముందుకు రావడం లేదని, గిరాకీ తగ్గిందని రైతులు వాపోతున్నారు. ఇక రిలయన్స్ ఏర్పాటు చేస్తున్న నాలుగువేల మెగావాట్ల అల్ట్రామెగా థర్మల్ విద్యుత్ కేంద్రం, ఎపిజెన్‌కో, థర్మల్ పవర్‌టెక్ విద్యుత్ కేంద్రాలు, తోళ్ల పరిశ్రమ, పామాయిల్ ఫ్యాక్టరీలు ఏర్పాటు కానుండడంతో భవిష్యత్తులో ముత్తుకూరు మండలం మరింతగా కాలుష్య కోరల్లో చిక్కుకోనుందని పర్యావరణ శాస్త్రవేత్తలు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని చెట్లను పెంచాల్సిన అవసరం ఎంతైనా వుందని, దాని వల్ల ప్రజల ఆరోగ్యాలను, పర్యావరణ సమతుల్యతను కాపాడవచ్చని చెప్తున్నారు. మండలంలోని ప్రజలే దీనికి నడుంబిగించాల్సి వుంది.

# నష్టాల్లో నిమ్మరైతులు!

జిల్లాలో ఒకనాడు సిరులు కురిపించిన నిమ్మసాగు నేడు రైతులకు నష్టాలను మిగులుస్తోంది. షుమారు 70వేల ఎకరాల్లో నిమ్మపంట సాగవుతుంది. గిట్టుబాటు ధర లేక పోవడంతో రైతులు ఆందోళన చెందుతున్నారు. గూడూరు, వెంకటగిరి మార్కెట్లలో గతంలో 3వేల రూపాయలు పలికిన బస్తా ధర నేడు 1300రూపాయలకు మించడం లేదు. ఆరుగాలం కష్టపడి పండించినా చివరకు పెట్టుబడులు కూడా రావడం లేదని నిమ్మ రైతులు వాపోతున్నారు. మరోవైపు

### గిట్టుబాటు ధరేది?

ఏలూరు, తెనాలి, విజయవాడ మార్కెట్‌ను తట్టుకొని నిలబడలేకపోతుందని ఆ కారణంగా ధర పలకడం లేదంటున్నారు. గతంలో గూడూరు మార్కెట్ దేశవ్యాప్తంగా నిమ్మ ఎగుమతుల్లో పేరు గడించింది. గుజరాత్, కర్నాటక, తమిళనాడు, ఒరిస్సా, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర తదితర రాష్ట్రాల్లో ఈ పంట విస్తరించడంతో మార్కెట్‌లో రైతులకు గట్టి పోటీ నివ్వడం మరో కారణం. దీంతో పంటలపై లాభాలు లేకపోవడంతో గూడూరు డివిజన్‌లోని రైతాంగం క్రమేణా తోటలను తొలగించి వేశారు. పెట్టుబడులు పెరిగిపోవడం, ధర లేకపోవడంతో నిమ్మ రైతులు విలవిల్లాడిపోతున్నారు.

# బోగోలులో సిమెంటు రోడ్ల ధ్వంసం!

● కొళాయి కనెక్షన్ల కోసమని సమర్థన

ఎంకి పెళ్లి సుబ్బి చావు కొచ్చిన చందంగా వుంది బోగోలు పంచాయితీ పరిస్థితి. గ్రామాల్లో మంచినీటి సరఫరా కోసం కొళాయి కనెక్షన్లు ఇచ్చే నెపంతో లక్షల రూపాయలు విలువ చేసే సిమెంటు రోడ్లు ధ్వంసం అయిపోవడం గ్రామస్తులను బాధపెడుతున్నది. 1986 సంవత్సరంలో ఎన్టీఆర్ ముఖ్యమంత్రిగా వున్న సమయంలో రెవెన్యూశాఖ మంత్రిగా వుండిన నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డి చేతుల మీదుగా బోగోలు పంచాయితీలో మంచినీటి ట్యాంకును ప్రారంభించారు. 500 కొళాయి కనెక్షన్లు వున్న బోగోలులో నేడు 1100 కనెక్షన్లకు చేరుకొంది. జనాభా పెరిగిపోవడంతో దానికి తగినట్లు నీటి సరఫరా చేయడంలో పంచాయితీ విఫలమైంది. దీనికి తోడు అక్రమ మోటార్లు బిగించి నీటిని తోడుకొంటుండడంతో కొళాయినీటిపై ఆధారపడిన ప్రజలు నీటి కోసం అల్లాడుతున్నారు. కొత్త కనెక్షన్ల కోసం లక్షలు పెట్టి నిర్మించిన సిమెంటు రోడ్లను ధ్వంసం చేస్తుండడం పలువురికి కడుపు మండిస్తోంది. చిన్న మసీదు వీధి, మార్కెట్‌వీధి, కొండుసింగ్ వీధుల్లో రోడ్లను ఇష్టానుసారంగా త్రవ్వి సక్రమంగా పూడ్చకపోవడంతో నడవడం కష్టమైందని స్థానికులు వాపోతున్నారు.

## గూడూరు దాహం తీర్చను 15కోట్లు

గూడూరు మండలంలోని 14 పంచాయితీల్లో త్రాగునీటి సమస్యను అధిగమించేందుకు ప్రభుత్వం 15కోట్లు విడుదల చేసిందని ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్ తెలిపారు. పల్లెల్లో ప్రజలు ఎదుర్కొంటున్న నీటి సమస్యలను స్వయంగా చూసి ఉండడంతో ఈ విషయమై అసెంబ్లీలో చర్చించామన్నారు. దీంతో మండలంలో త్రాగునీటి ఎద్దడి వున్న చెన్నూరు బిట్–1, తిప్పవరప్పాడు, కందలి, చెమర్తి, కొమ్మనేటూరు, వజ్జావారి కండ్రిగ, గొల్లపల్లి, నెర్నూరు, రెడ్డిగుంట, మంగళపూరు పాలిచెర్ల, పాలిచెర్ల రాజుపాళెం, వెడిచర్ల కుందకూరు, వెందోడు, కొండాగుంట, మేఘనూరు, అయ్యావారిపాళెం గ్రామాల్లో పైపులైన్లు, పంపులు తదితర అవసరాలకు ఈ నిధులను ఖర్చుచేయనున్నారు. ఈ నిధుల మంజూరుతో ఈ ప్రాంత ప్రజలకు మంచినీటి సమస్య తీరనుంది.

## రైతుమిత్ర గ్రూపుల్లో కౌలుదార్లు

రైతుమిత్ర గ్రూపుల్లో కౌలుదార్లు చేరినట్లయితే వారు సబ్సిడీ ద్వారా వ్యవసాయ పనిముట్లు, ఇతర సదుపాయాలను పొందవచ్చని వ్యవసాయశాఖ ఎడి రవిచంద్రప్రసాద్ తెలిపారు. అంతేకాకుండా కౌలుదార్లు 5 లేక 10 మంది ఒక గ్రూపుగా ఏర్పడినట్లయితే ఒకరికొకరు జామీను పద్ధతితో బ్యాంకు ద్వారా రుణ సదుపాయం పొందే అవకాశం వుందన్నారు. కౌలుదార్లు ఈ అవకాశాన్ని వినియోగించుకోవాలని కోరారు.

## జిల్లాలో మరోసేవా కుసుమం

డాక్టర్ ఓబులరెడ్డి రామిరెడ్డి, డాక్టర్ సుమిత్రారెడ్డి సహకారంతో 2004లో ఏర్పాటైన కె.సుజాతమ్మ చారిటబుల్ ట్రస్టు పలు సేవాకార్యక్రమాలను చేపడుతూ వుంది. మర్రిపాడు మండలం కదిరినాయుడుపల్లి గ్రామంలో పాఠశాల అభివృద్ధికి ఎన్నో కార్యక్రమాలు చేపట్టింది. 2 లక్షల రూపాయలతో 2006లో ఉచిత మధ్యాహ్న భోజనాన్ని స్వచ్ఛందంగా చేపట్టారు. విద్యార్థులకు స్కూలు యూనిఫాంలు అందజేయడంతోపాటు బోధనేతర సిబ్బందికి ట్రస్టు నుంచి జీతాలను చెల్లిస్తున్నారు. ప్రతి ఏడాది 1.30లక్షలతో 9 ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలలోని పిల్లలకు ఉచితంగా నోటుపుస్తకాలు పంపిణీ చేస్తున్నారు ట్రస్టు నిర్వాహకులు పూండ్ల శేషారెడ్డి.

కదిరినాయుడుపల్లి, తాటిపర్తి గ్రామాల్లోని జడ్పీహైస్కూల్లో సరస్వతి మందిరాన్ని, ఫర్నిచర్‌ను 1.70లక్షలతో ఏర్పాటు చేయడం ట్రస్టు సేవాకార్యక్రమాలకు నిదర్శనం. దీంతోపాటు ఉచిత వైద్యశిబిరాలు నిర్వహిస్తూ పిల్లలకు ఉచితంగా హెపటైటిస్ వ్యాక్సిన్‌లు వేస్తున్నారు.

డాక్టర్ ఓబులరెడ్డి సోదరుడు స్థానిక సర్పంచ్ రాధాకృష్ణారెడ్డి యుఎస్‌లో గల డాక్టర్ కేశవరెడ్డి, డాక్టర్ శ్రీనివాసులరెడ్డి సహకారంతో గంగిరెడ్డి రామలక్ష్మమ్మ ట్రస్టు ద్వారా 10వ తరగతిలో ఉత్తీర్ణులైన మొదటి ముగ్గురు విద్యార్థిని విద్యార్థులను శ్రీ చైతన్య కాలేజిలో ఇంటర్మీడియట్‌కు అయ్యే ఖర్చును భరిస్తున్నారు. అలాగే ఇంజనీరింగ్, నర్సింగ్ విద్యార్థులకు ఆర్థిక సహాయసహకారం అందిస్తున్న ట్రస్టు సేవలు అభినందనీయం.

# అంధకారం రాజ్యమేలుతోంది!

### మహిమలూరు ఎస్టీకాలనీలో పదేళ్లుగా పరిస్థితిది.

ప్రభుత్వ ఆదేశాలు, అధికారులు ఉత్తర్వులు ఇచ్చినా, చివరకు నిధులు మంజూరైనా ఆత్మకూరు మండలంలోని పలు కాలనీలు ఇంకా విద్యుత్ సరఫరాకు నోచుకోక అంధకారంలో మగ్గుతున్నాయి. ఇందిరమ్మ పథకం ద్వారా కాలనీలకు సత్వరం విద్యుత్ సరఫరా చేస్తామని చెప్తున్నా ఆచరణలో మాత్రం అందుకు విరుద్ధంగా వుంది. గత పదేళ్లుగా మహిమలూరు ఎస్టీ కాలనీలో చీకటి అలుముకొని వుంది. ఇటీవల ఈ కాలనీకి ఇందిరమ్మ పథకం క్రింద విద్యుదీకరణ చేస్తామని అధికారులు హామీ ఇచ్చారు. రెండు లక్షల రూపాయలకు ట్రాన్స్‌కో అధికారులు అంచనాలు సిద్ధం చేశారు. కానీ ఫలితం శూన్యం. అలాగే తొలి విడత ఇందిరమ్మ ఆదర్శ గ్రామంగా ఎంపికైన బట్టేపాడు ఎస్సీ కాలనీలోనూ రెండేళ్లుగా విద్యుత్ కనెక్షన్‌లు ఇవ్వలేదు. దేవూరు పొలాల్లో 20 ఏళ్లుగా పూరిగుడిసెలు వేసుకొని జీవిస్తున్న గిరిజనులు ఏడాది క్రితం పక్కాగృహాలు నిర్మించుకొన్నారు. అయినా ఈనాటికీ వారికి విద్యుత్ వెలుగులు అందక అంధకారంలో మగ్గుతున్నా అటు ప్రజాప్రతినిధులు కాని, ఇటు అధికారులు గాని పట్టించుకోకపోవడంతో ఈ కాలనీల వాసులు చీకటిలో భయంభయంగా బ్రతుకు వెళ్లదీస్తున్నారు.

# బ్రతికుండగానే చంపేశారు!

### మాజీ సైనికుని ఆవేదన

బ్రతికున్న వ్యక్తిని చనిపోయారంటూ పింఛను నిలిపివేసిన సంఘటన తోటపల్లి గూడూరు మండలంలో చోటు చేసుకొంది. ఇటీవల కాలంలో చనిపోయిన వారిని బ్రతికున్నట్లుగా చూపి పలు అక్రమాలకు పాల్పడుతున్న సంగతి తెలిసిందే. ఇది అందుకు విరుద్ధం. కోడూరు గ్రామానికి చెందిన వాసుదేవమూర్తి సైన్యంలో పనిచేసి రిటైరయ్యారు. ఆయనకు మూడు ఎకరాల భూమిని ప్రభుత్వం అందించింది. దీంతోపాటు వృద్ధాప్య పింఛను కోసం అధికారుల చుట్టూ కాళ్లరిగేలా తిరిగితే అదీ మంజూరైంది. ఏప్రెల్ నెల వరకు నెలకు 200 రూపాయలు తీసుకొంటున్న ఆ మాజీ సైనికుడు ఏప్రెల్ చివరిలో సొంత పనులపై బయటి ప్రాంతానికి వెళ్లి నెల తర్వాత తిరిగి వచ్చాడు. పింఛను సమయం దాటిపోవడంతో ఆయన అందుకోసం పంచాయితీ కార్యాలయానికి వెళ్లగా అక్కడ వారు చెప్పిన మాటలు విని నిర్ఘాంత పోయాడు. నువ్వు మరణించావని భావించి పింఛను జాబితాలో నుంచి పేరు తొలగించినట్లు చెప్పడంతో ఆ వృద్ధుడు దిక్కుతోచక కళ్లనీళ్ల పర్యంతమయ్యాడు. ఎలాంటి ఆధారాలు లేకుండా తాను చనిపోయానని పింఛను నిలిపి వేయడం అన్యాయం అని, తనకు న్యాయం చేయాలని కోరుతున్నాడు. కొందరు గ్రామస్తులు రెవెన్యూ సిబ్బందితో కుమ్మక్కై ప్రభుత్వం తనకిచ్చిన భూమిని స్వాహా చేసేందుకు ప్రయత్నిస్తున్నారని ఆయన వాపోతున్నాడు.

## మీకొకటి మాకొకటి

రాష్ట్ర సమాచార కమిషనర్ల పోస్టుల్ని కాంగ్రెస్, తెలుగుదేశం పంచుకుంటున్నాయి. సమాచార కమిషనర్లను ఎంపిక చేసే కమిటీలో ప్రతిపక్ష నాయకుడి హోదాలో చంద్రబాబు సభ్యుడిగా వున్నాడు. దీంతో కమిషనర్ల ఎంపికలో 'బాబు' అభిప్రాయం కూడా కీలకంగా మారింది.



ప్రస్తుతం సిఎం కార్యదర్శిగా వున్న జన్నత్ హుస్సేన్‌ను ప్రధాన కమిషనర్‌గా నియమించాలని కెవిపి, రోశయ్య నిర్ణయించారు. జన్నత్‌కు బాబుకు మధ్య మొదటి నుంచీ అంతగా సఖ్యతలేదు. దీనివల్ల జన్నత్ నియామకానికి బాబు మోకాలడ్డుతాడేమోనని రోశయ్య అనుమానిస్తున్నాడు. అందుకే జన్నత్ నియామకానికి 'బాబు' అంగీకరిస్తే, బాబు చెప్పిన వారిని మరో కమిషనర్‌గా నియమిస్తామంటూ రోశయ్య ఆఫర్ ఇచ్చాడు. బాబుకు ఎంతో ఆత్మీయుడైన ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ఎస్‌వి.ప్రసాద్ ఇందుకు రాయబారం జరిపాడట. బాబు కూడా దీనికి అంగీకరించడంతో జన్నత్ నియామకానికి క్లియర్ అయ్యింది. ఇంతకూ బాబు సిఫార్సు చేస్తున్న కమిషనర్ అభ్యర్థి మాత్రం ప్రస్తుతానికి సస్పెన్స్!

## 'గాలి ముద్దు'కి పూర్వవైభవం



గాలి ముద్దుకృష్ణమ నాయుడికి రోశయ్యకు మధ్య దగ్గర పోలిక వుంది. గతంలో రోశయ్య కాంగ్రెస్ తరఫున, గాలి ముద్దు తెలుగుదేశం తరఫున బజారులో పడి కాట్లాడుకునేవారు. రోశయ్య మాటకారితనానికి గాలి ముద్దు గాసిప్‌కు పెద్ద తేడా వుండేది కాదు. తెలుగుదేశంలో రోశయ్యగా గాలి ముద్దును పిలుచుకునేవారు. ఇప్పుడు రోశయ్య సిఎం స్థానంలో వుండగా గాలి ముద్దు తెలుగుదేశం పార్టీ ఎమ్మెల్యేగా వున్నాడు. గతంలో మాదిరిగానే తెలుగుదేశం పార్టీ గాలి ముద్దుని రోశయ్యపై ఓ అస్త్రంగా ప్రయోగిస్తోంది. కొన్ని రోజులుగా కాంగ్రెస్ పార్టీని, రోశయ్య ప్రభుత్వాన్ని ఎండగట్టే బాధ్యతను గాలి ముద్దుకు అప్పగించారు. ఆయన కూడా తన శక్తిమేరకు సోనియాను, రోశయ్యను తిట్టిపోస్తున్నాడు. సోనియా భారతీయుల రక్తం పీలుస్తోందని, రోశయ్య రాక్షసుడిగా వ్యవహరిస్తున్నాడంటూ విమర్శించాడు. దీంతో చిర్రెత్తుకొచ్చిన కాంగీయులు ఏకంగా గాలి ముద్దు ఇంటి పైకి దండెత్తి నిరసన తెలిపారు. దీంతో తెలుగుదేశం పార్టీలో గాలి ముద్దుకి పూర్వవైభవం వచ్చిందంటూ పచ్చచొక్కాలు గుసగుసలాడుతున్నాయి.

## డిఎస్ ఓటమికి తెలుగుదేశం వ్యూహం



రాష్ట్ర కాంగ్రెస్ చీఫ్ డి.శ్రీనివాస్‌ను ఓడించడానికి తెలుగుదేశం పార్టీ వ్యూహాన్ని రచించింది. నిజామాబాద్ అర్బన్ నియోజకవర్గం నుంచి డిఎస్ పోటీ చేస్తున్నాడు. అక్కడ బిజెపి అభ్యర్థికి తెలంగాణవాదులు మద్దతు ఇస్తున్నారు. ఈ నియోజకవర్గంలోని హిందువుల ఓట్లు బిజెపి అభ్యర్థికి ప్రధానాస్త్రంగా వున్నాయి. కాగా మరో మెజారిటీ వర్గం ముస్లింల ఓట్లపై డిఎస్ ఆశలు పెట్టుకున్నాడు. దీన్ని దెబ్బ తీసేందుకు తెలుగుదేశం పార్టీ ముస్లిం అభ్యర్థిని బరిలోకి దింపుతోంది. దీంతో ముస్లింల ఓట్లలో చీలిక రాక తప్పదన్నది తెలుగుదేశం పార్టీ ఆలోచన. అటు తెలంగాణవాదులు, బిజెపి మద్దతుదారులతో హిందువుల ఓట్లు చీలుతాయి, ఇటు ముస్లింల ఓట్లూ చీలుతాయి కాబట్టి వైఎస్ ఓటు బ్యాంకుకు గండిపడటం ఖాయమన్నది తెలుగుదేశం పార్టీ అంచనా. పాపం డిఎస్... గెలిస్తే సిఎంను అవుతానంటూ గడపగడపా తిరుగుతున్నాడు. జనం ఏం చేస్తారో వేచి చూడాల్సిందే!!

## గాదె చెబితే సరి!




రోశయ్యకు దేవాదాయ మంత్రి గాదె వెంకటరెడ్డిపై బాగా గురి కుదిరినట్లుంది. గాదె ఏం చెప్పినా రోశయ్య వెనుకాముందూ ఆలోచించడం లేదట. గాదె చెప్పాడా? అయితే 'ఓకే' అంటూ రోశయ్య గ్రీన్ సిగ్నల్ యిస్తున్నాడట. ఈ విషయం కాస్తా రాజకీయవర్గాల్లో విస్తృతంగా ప్రచారం జరిగింది. దీంతో రోశయ్యతో 'పని' వున్న వాళ్లంతా ఇప్పుడు గాదె ఇంటి గడప ముందు వాలుతున్నారట. పనిలో పనిగా కొందరు ఐఎఎస్‌లు కూడా గాదెను ఆశ్రయిస్తున్నారు. 'మంచి' పోస్టింగ్ యిప్పించమంటూ గాదెను శరణువేడుతున్నారు. దీంతో రోశయ్య వరం పొందడానికి ముందు గాదెను కలవడం తప్పనిసరైందని సచివాలయ వర్గాలు బాహాటంగా చెబుతున్నాయి. సిఎం దగ్గర గాదె పలుకుబడి పెరగటంతో ఆయన వ్యవహారశైలిలో మార్పు కొట్టొచ్చినట్లు కనపడుతోందట! ఎంతైనా ఇద్దరూ ఒకే జిల్లావాళ్లు కదా!




## సిఎం పిఆర్వోకు మంగళం!

ముఖ్యమంత్రి ప్రజాసంబంధాల అధికారి చంద్రశేఖర్‌రెడ్డికి ఉద్వాసన చెప్పాలని రోశయ్య నిర్ణయించాడట. రాయలసీమకు చెందిన చంద్రశేఖర్‌రెడ్డి గతంలో ఉదయం పత్రికలో విలేకరిగా పనిచేశాడు. కోట్ల విజయభాస్కర్ రెడ్డి సిఎంగా వున్నప్పుడు చంద్రశేఖర్‌రెడ్డిని పిఆర్‌ఓగా పెట్టుకున్నాడు. ఆ తర్వాత ట్రాన్స్‌కోలో ఉద్యోగం వేయించాడు. వైఎస్ సిఎం అయ్యాక తిరిగి చంద్రశేఖర్‌రెడ్డి పిఆర్‌ఓగా వచ్చాడు. అప్పటి నుంచి సిఎం పిఆర్‌ఓగానే వుంటున్నాడు. అయితే రోశయ్య సిఎం అయిన దగ్గర నుంచే పేషీ రహస్యాలు లీకవుతున్నాయట. సిఎం పేషీలో జరిగే విషయాలన్నీ సాయంత్రానికి జగన్ శిబిరానికి చేరిపోతున్నాయి. దీనిమీద రోశయ్య ఆరా తీశాడట. పిఆర్‌ఓ చంద్రశేఖర్‌రెడ్డి మొదటి నుంచీ జగన్ శిబిరానికి దగ్గరగా వుంటున్నాడని, ఆయన ద్వారానే రహస్యాలు లీకవుతున్నాయని తేలిందట. దీనితో చంద్రశేఖర్‌రెడ్డికి ఉద్వాసన పలకాలని రోశయ్య నిర్ణయించాడు. అయితే కెవిపి ఇందుకు అడ్డుపడుతున్నాడట. చూద్దాం. రోశయ్య ఏం చేస్తాడో!

## క్లిక్... క్లిక్... క్లిక్



జనార్దనరెడ్డికి ఆత్మీయ సత్కార సభలో జ్ఞాపికను బహూకరించిన రాజీవ్‌భవన్ నేతలు.



సత్కార సభలో మాట్లాడుతున్న రాష్ట్ర రెవిన్యూశాఖా మంత్రి ధర్మాన ప్రసాదరావు.



హైదరాబాద్‌లో జరిగిన రాజ్యసభ సభ్యుడు నేదురుమల్లి జనార్దనరెడ్డి కుమారుడు అశోక్, పూజల పెళ్లికి హాజరై వధూవరులను ఆశీర్వదిస్తున్న రాష్ట్ర గవర్నర్ నరసింహన్.



హైదరాబాద్‌లో జరిగిన రాజ్యసభ సభ్యుడు నేదురుమల్లి జనార్దనరెడ్డి కుమారుడు అశోక్, పూజల వివాహ సందర్భంగా నూతన దంపతులతో ముఖ్యమంత్రి రోశయ్య.

# పుణ్యతిథులు - విశేష పూజలు!

దేవతలను పలురకాలుగా పూజిస్తుంటారు. ఎవరికి తోచిన రీతిలో వారు భగవంతున్ని ప్రార్థించి భక్తి ప్రపత్తులు చాటుకుంటారు. పూజలు వ్రతాలను సరైన రీతిలో నియమనిష్టలతో ఆచరించినట్లయితే పుణ్యఫలం కలుగుతుంది. దీనికి సంబంధించి వివిధ తిథులు, ఆ తిథుల యొక్క ప్రత్యేకతను, ఆనాడు ఏ దేవతలను ఆరాధిస్తే ఎంతటి పుణ్యం కల్గుతుందనే దాని గురించి వరాహ పురాణంలో వివరించబడింది.

వరాహ పురాణంలో వరాహమూర్తిగా వున్న శ్రీ మహావిష్ణువు స్వయంగా ఆయా తిథుల విశేషాలను భూదేవికి వివరించి చెప్పాడు. దీని ప్రకారం తిథులలో మొదటిది పాడ్యమి. దేవతలలో ముందు పుట్టినవాడు అగ్ని కాబట్టి తిథులలో మొదటిదైన పాడ్యమినాడు అగ్నిని ఆరాధిస్తే పుణ్యఫలం దక్కుతుంది. ఆ రోజున ఉపవాసం వుండినట్లయితే అగ్నిదేవుని కృపకు పాత్రులవుతారు.

విదియనాడు అశ్వనీ దేవతలను ఆరాధించాలి. వారు ఆ తిథి నాడే జన్మించినందువల్ల ఏడాదిపాటు అశ్వనీ దేవతలను ఉద్దేశించి విదియ వ్రతాన్ని నియమనిష్టలతో చేస్తే శుభప్రదం.

తదియ నాడు గౌరీదేవిని పూజించాలి. గౌరీ కళ్యాణం తదియ నాడు జరిగినందువల్ల గౌరీదేవికి ఆ తిథి అంటే ఇష్టం. ఇది ప్రత్యేకంగా స్త్రీల కోసం ఏర్పాటైంది.

చవితి వినాయకుడు పుట్టిన తిథి. ప్రత్యేకంగా వినాయక చవితి నాడే కాక ప్రతి శుద్ధ చవితినాడు వినాయకుడ్ని పూజించవచ్చు.

పంచమినాడు నాగులు జన్మించాయి. అందుకని నాగదేవతలకు పంచమి తిథి అన్నా, నాగుల చవితి అన్నా ఇష్టం. ప్రతి పంచమినాడు పుట్టలో పాలు పోసి నాగ పూజ చేస్తే నాగుల వల్ల భయం ఉండదు.

షష్టి కుమారస్వామి జన్మతిథి. ఆ రోజున అర్చన చేసినట్లయితే కుమారస్వామి అనుగ్రహం లభిస్తుంది.

సప్తమి సూర్యుడి జన్మతిథి. రథ సప్తమి నాడే కాక ప్రతి శుద్ధ సప్తమి నాడు సూర్యుడిని ఆరాధించి క్షీరాన్నాన్ని నివేదిస్తే ఆయురారోగ్యాలు కలుగుతాయి.

అష్టమి దుర్గాదేవి, అష్టమాతృకలు ఆవిర్భవించిన తిథి. ఆనాడు అష్టమాతృకలను, దుర్గాదేవిని పూజిస్తే ఎంతో పుణ్యం కల్గుతుంది.

నవమి దుర్గాదేవికి ప్రీతికరమైనదే. ఆ తిథినాడు దుర్గను పూజించి ఉపవాసం వుంటే సంపదలు కల్గుతాయి.

దశమి నాడు దిక్కుల సృష్టి జరిగింది. ఇంద్రాది దేవతలు ఈ దిక్కులకు పాలకులు. దిక్పాలకులను దశమినాడు పూజిస్తే పాపాలు తొలగుతాయి.

ఏకాదశి కుబేరుడు పుట్టిన తిథి. ఆరోజున కుబేర పూజ చేస్తే ఐశ్వర్య ప్రదం.

ద్వాదశి విష్ణువుకు ప్రీతికరమైన తిథి. ఆనాడే విష్ణుమూర్తి వామనుడిగా జన్మించాడు. ద్వాదశినాడు ఆవునెయ్యితో వ్రతం చేస్తే పుణ్యం లభిస్తుంది.

త్రయోదశి ధర్ముడు పుట్టిన తిథి. ఆరోజున ఎవరికి ఇష్టమైన దైవాన్ని వారు ధర్మబద్ధంగా, శాస్త్రబద్ధంగా పూజిస్తే అధిక పుణ్య ఫలం.

చతుర్దశి రుద్రుని తిథి. ఆనాడు రుద్రార్చన చేసినట్లయితే శుభప్రదం. కృష్ణ చతుర్దశినాడు మాస శివరాత్రి వస్తుంది. ఆ తిథి శివుడికి ప్రీతికరం.

అమావాస్య పితృదేవతలకు ఇష్టమైన తిథి. దర్భలు, నువ్వులు, నీళ్లతో పితృదేవలకు తర్పణమిస్తే వారు సంతోషించి సంతాన సౌఖ్యం అనుగ్రహిస్తారు.

పూర్ణిమకు చంద్రుడు అధిపతి. పూర్ణిమనాడు పగలంతా ఉపవాసం వుండి రాత్రికి చంద్రుడిని పూజించినట్లయితే ధనధాన్యాలు, ఆయురారోగ్యాలు, భోగభాగ్యాలు ప్రాప్తిస్తాయి.



## ట్రంకు రోడ్డు

### లగడపాటి వరాలు!

సమైక్యాంధ్ర ఉద్యమనేతగా రాష్ట్ర ప్రజలందరికీ సుపరిచితుడైన విజయవాడ పార్లమెంటు సభ్యుడు లగడపాటి రాజగోపాల్ ఆరణాల నెల్లూరీయుడు. ఆయన తల్లి స్వగ్రామం చేజర్ల మండలం పెరుమాళ్లపాడు. తండ్రిది సంగం మండలం అమరవ్పనాయుడు కండ్రిగ. ఇక్కడే పుట్టినా హైదరాబాద్‌లో స్థిరపడిపోయారాయన. ఈవారం స్వగ్రామానికి వచ్చిన ఆయన తల్లి కోరిక మేరకు పెరుమాళ్లపాడులో మినరల్ వాటర్ ప్లాంట్ నిర్మించి గ్రామస్తులకు ఉచితంగా మంచినీరు అందిస్తానన్నారు. చుట్టుప్రక్కల గ్రామాల్లో బస్టాపుల నిర్మాణానికి ఓకే అన్నారు. ముస్లింల కోరిక మీద మసీదులు, క్రైస్తవ సోదరుల కోరిక మేరకు చర్చిల నిర్మాణానికి వాగ్దానాలు చేశారు. గ్రామదేవతను దర్శించిన ఆయన ఈ ఆలయ అభివృద్ధికి కృషి చేస్తానన్నారు. ఎప్పుడో చిన్నతనంలో గ్రామాన్ని విడిచిపోయినా స్వగ్రామం పట్ల ఆయన కురిపించిన వరాల జల్లుకు స్థానికులు వుబ్బితబ్బారు.






### లేఖలతో సరి!

ఆంధ్రప్రదేశ్ వైద్య విధాన పరిషత్ జిల్లా కోఆర్డినేటర్ డాక్టర్ చెన్నయ్య మంచి రాతగాడు. జిల్లాలోని ప్రభుత్వ ఆస్పత్రులు లెక్కలేనన్ని సమస్యలతో సతమతమవుతుంటే తక్షణం ఫోన్ ద్వారా సంప్రదించి పరిష్కరించాల్సిన వాటికి కూడా ఉన్నతాధికారులకు లేఖల మీద లేఖలు వ్రాసి జాగు చేస్తుంటారాయన. ఆయన లేఖాస్త్రాల పిచ్చివల్ల పెద్దాస్పత్రిలో చిన్న చిన్న సమస్యలు కూడా పరిష్కారానికి నోచుకోక రోగులు నానా ఇబ్బందులు పడుతున్నారు. నిమిషాల్లో పరిష్కరించాల్సిన సమస్యలను సైతం కాగితం మీద సమాధానం రాబట్టలంటూ ఏళ్ల పూళ్ల పట్టించిన సందర్భాలు వున్నాయని పెద్దాస్పత్రిలో వైద్యులే లోలోన సణుగుతున్నారు.

### ద్విపాత్రాభినయం

సినిమాల్లో హీరోలు ద్విపాత్రాభినయం చేసినట్లు నెల్లూరులోని ఆర్మ్‌డ్ రిజర్వు పోలీసులు చేస్తున్నారు. పోలీసు శాఖలో ఆర్డర్లీ వ్యవస్థ లేదని చెప్పినా ఆ మాట నీటిమూటేనని చాటి చెబుతూ సివిల్ డ్రస్సులో ఆర్మ్‌డ్ రిజర్వు పోలీసులు ఎస్పీ బంగ్లా ముందు గుట్టపోసిన మట్టిని శ్రీకాకుళం కూలీల మాదిరి చెమటలు కక్కుతూ ఎత్తారు. మళ్లీ డ్యూటీ గంట మోగడంతో డ్రస్ ధరించి విధులకు హాజరయ్యారు. ఆర్మ్‌డ్ రిజర్వు పోలీసులకు వెట్టి చాకిరి తప్పడం లేదు. కాని క్రమశిక్షణ గల శాఖగా వాళ్లు ఈ విషయాన్ని బయటకు చెప్పుకోకూడదు!



### ఏ వార్డన్ హాస్టల్‌లో వున్నారు?




అల్లూరు బిసి బాలికల హాస్టల్‌లో కలుషిత ఆహారం తిని 25 మంది బాలికలు అస్వస్థులు కావడంతో ఈ వ్యవహారం జిల్లావ్యాప్తంగా చర్చనీయాంశమయ్యింది. ఎంతో చరిత్ర గల అల్లూరు ప్రభుత్వాస్పత్రి నామమాత్రం కావడంతో పిల్లలందరినీ నెల్లూరు ప్రభుత్వాస్పత్రికి తీసుకరావడంతో నేతలు, అధికారులు వాళ్లను పరామర్శించి బిస్కెట్ ప్యాకెట్లు ఇచ్చారు. ఘటనపై కలెక్టర్ కారాలు మిరియాలు నూరడంతో జిల్లాలోని యావత్తు యంత్రాంగం తనిఖీకంటూ అల్లూరువచ్చి వార్డన్, వంట మనిషిని సస్పెండ్ చేశారు. ఫుడ్ ఇన్‌స్పెక్టర్ బాలికలకు వండిపెట్టిన ఆహారంలో వినియోగించిన నిత్యావసర వస్తువులు చెడిపోయినవని నిర్ధారించి హాస్టళ్లలో వంటకు వాడుతున్న వస్తువుల జాతకం బయటపెట్టారు. వాస్తవానికి జిల్లాలోని ఏ హాస్టల్‌లో వార్డన్ హాస్టల్‌లో వుండడు. మూడురోజులకోమారు హాస్టల్‌కు వెళ్లి వంట మనిషికి రేషన్ ఇచ్చివస్తారు. హెల్పర్, వంట మనుషులే అసలైన వార్డన్లు. మరి ఒకరిద్దరిపై చర్యలతో హాస్టళ్లు బాగుపడతాయా అన్నది ట్రంకురోడ్డులో చర్చ.



### కోడిగుడ్లు అపురూపం!

ఇది కలికాలం. అన్నింటికి ఇకొరతే. రేట్లు మాత్రం ఏమాత్రం తగ్గవు... కొండెక్కి కూర్చొని వుంటాయి. రకరకాల కారణాల వల్ల కోడి మాంసానికి డిమాండ్ పెరిగిపోయింది. మాంసం కోసం పెంచే బ్రాయిలర్ కోళ్ల బాగా తగ్గిపోయాయి. దీంతో గుడ్లు పెట్టే లేయర్లను బ్రాయిలర్లంటూ అమ్మేస్తున్నారు. లేయర్ల కోతకు క్యూ కట్టడంతో గుడ్లు పెట్టే కోళ్ల తగ్గిపోయాయి. దీంతో కోడిగుడ్ల ధర ఈ వారంలో అమాంతం పెరిగిపోయింది. మరో రెండు మూడు నెలల వరకు మార్కెట్‌లో కోడిగుడ్లు కనపడకపోయినా ఆశ్చర్యపోనక్కరలేని మాయదారి రోజులొచ్చాయి.

# వారఫలాలు

తేది 3-07-2010 నుండి 9-07-2010 వరకు మిథునంలో రవి, బుధ, కేతువులు; కర్కాటంలో శుక్రుడు; సింహంలో కుజుడు; మీనంలో గురువు; కన్యలో శని; ధనుస్సులో రాహువు; కన్య, తుల, వృశ్చికాల్లో చంద్రుడు సంచరిస్తారు.



**మేషం**
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

అలర్జీ, దగ్గు, వాతపునొప్పులు వంటి చిన్న చిన్న అనారోగ్య పరిస్థితులే తప్ప తీవ్ర ఇబ్బందులుండవు. కుటుంబవిషయాలు ప్రశాంతంగా సాగుతాయి. పరస్పర అవగాహన చక్కగా ఉంటుంది. ఎన్నాళ్లుగానో ఎదురుచూసిన డబ్బు చేతికందుతుంది. పొదుపు వృద్ధికి ప్రయత్నాలు చేస్తారు. వ్యాపారులకు మిశ్రమ ఫలితాలుంటాయి. వృత్తిపరులకు అధిక శ్రమ ఉంటుంది.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

గ్యాస్ట్రిక్, ఆంత్రబాధలుంటాయి. కళత్రసుఖం చక్కగా ఉంటుంది. ఆధ్యాత్మిక విషయాలలో చొరవ చూపుతారు. కాని సంతానమూలంగా కష్టాలుంటాయి. తీర్థయాత్ర ప్రయత్నాలు చేస్తారు. ధనవిషయంలో పురోభివృద్ధి ఉంటుంది. భవిష్యత్తుకు మంచి పథకాలు వేస్తారు. వ్యాపారుల ముందు చూపు మేలు ఫలితాల నందిస్తుంది. భాగస్వామ్యం చక్కగా సాగుతుంది.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

శారీరక అనారోగ్యం చింతకు దారి తీస్తుంది. అగ్ని, విద్యుత్తుకు సంబంధించిన ప్రమాదాలు ఎదురవవచ్చు. కుటుంబంలో సమస్యలు అధికం. పరస్పర అవగాహనాలోపం తీవ్రమవుతుంది. భగవంతుని వైపు మనసు పోనిస్తారు. ఆర్థికవిషయాలు ఒకమోస్తరుగా ఉంటాయి. తృప్తికరమైన ఆదాయం ఉపశాంతినిస్తుంది. స్థిరాస్తుల అమ్మకానికి ప్రయత్నం చేస్తారు. కొత్తపెట్టుబడులు వద్దు.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

పైత్యప్రకోపం తప్ప వేరేవిధమైన ఆరోగ్య బాధ వుండదు. దాంపత్యసుఖానుభూతి చక్కగా ఉంటుంది. విరోధాలు కనుమరుగౌతాయి. ఆర్థికవిషయాలలో పురోభివృద్ధి ఉంటుంది. రుణప్రాప్తి సులువుగా సాగుతుంది. వ్యాపారులకు కొత్తభాగస్వాముల చేరిక లాభాన్నిస్తుంది. వృత్తిపరులకు మంచి రాణింపు ఉంటుంది. రాజకీయ ధురంధరుల తోడ్పాటుతో ఉద్యోగులు అనుకొన్నవి సాధిస్తారు.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

వాతప్రకోప బాధలుంటాయి. దీర్ఘకాలరోగులు జాగ్రత్తగా ఉండాలి. కుటుంబసభ్యులతో ఉంటూవచ్చిన అభిప్రాయభేదాలు తొలగిపోతాయి. తల్లి అనారోగ్యం జాగ్రత్త. ఆర్థికవిషయాలు తృప్తికరంగా ఉంటాయి. ఎదురుచూడని దారిలో ధనప్రాప్తి. మిత్రులు చేయూతనిస్తారు. భాగస్వాములతో జాగ్రత్త. వ్యాపారంలో పోటీ అధికం. వృత్తిపరులు విస్తరణ యోచన చేస్తారు.



**కన్య**
ఉత్తర 2,3,4పా. హస్త, చిత్త 1, 2 పా

ఆరోగ్యవిషయం బాగాలేదు. నిద్రలేమి, జ్వరం, జీర్ణకోశ బాధలుంటాయి. కళత్రంతో అభిప్రాయభేదాలు మనశ్శాంతి లేకుండా చేస్తాయి. పొరుగువారితో సంబంధాలు దెబ్బతింటాయి. ఆర్థికవిషయాలు తృప్తికరంగా ఉండవు. ఎదురుచూసిన డబ్బు చేతికి అందక పోవచ్చు. వ్యాపారులకు ఎదురుదెబ్బలతోబాటు రుణదాతల ఒత్తిడి అధికం. కొత్త పథకాల జోలికి పోవద్దు. వృత్తిపరులకు పోటీలధికం.



**తుల**
చిత్త 3,4 పా. స్వాతి, విశాఖ 1,2,3 పా

దీర్ఘకాల రోగులు హాయిగా గాలి పీల్చుకొనగా ఇతరులకు ఎలాంటి అనారోగ్య బాధలు కానరావడం లేదు. మానసిక విశ్రాంతికై ప్రయత్నిస్తారు. కుటుంబసభ్యుల పరస్పర అవగాహన, ఇచ్చిపుచ్చుకోడాలు సుఖశాంతుల నందిస్తాయి. ఖర్చులు అదుపులో ఉండి ధనప్రాప్తి చక్కగా ఉంటుంది. భాగస్వాముల ప్రోత్సాహంతో నూతన పథకాలతో వ్యాపార విస్తరణకు పూనుకొంటారు.



**వృశ్చికం**
విశాఖ 4 పా. అనూరాధ, జేష్ఠ

అనారోగ్య బాధలు అతిగా ఉంటాయి. జ్వరం, కీళ్ల నొప్పులు అధికంగా బాధిస్తాయి. కుటుంబంలో అశాంతి ఉంటుంది. భర్త, భార్యాసంబంధం చక్కగా ఉండకపోవచ్చు. ఆర్థికవిషయాలు మేలుగా ఉంటాయి. రుణప్రాప్తి అవకాశాలు బాగాఉన్నాయి. వ్యాపారులకు పోటీ అధికం. భాగస్వాములు సరిగా స్పందించరు. నూతన ఉద్యోగాలు లభించవచ్చు. లేదా మంచి మార్పులు ఉండవచ్చు.



**ధనస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

శరీరారోగ్య పరిస్థితులు చక్కగా ఉంటాయి. దీర్ఘకాలిక రోగులకు ఊరట. కుటుంబసభ్యుల తోడ్పాటు చక్కగా ఉంటుంది. దూరమైన మిత్రులు దరి చేరుతారు. ఆర్థిక విషయాలు చాలా చక్కగా ఉంటాయి. భాగస్వాములు కలిసిమెలిసి చక్కగా పనిచేస్తారు. పెట్టుబడుల నుండి మంచి లాభాలనందుకొంటారు. అప్పులు తీరుతాయి. ఉద్యోగులకు చాల చక్కని కాలం. శత్రువులు బలహీనపడతారు.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

గొంతు ఊపిరితిత్తుల బాధతప్ప పెద్దగా చెప్పుకోతగ్గ ఆరోగ్య బాధలేవీ ఉండవు. దాంపత్యసుఖం చక్కగా ఉంటుంది. సంతాన అనారోగ్యం మనశ్శాంతిని పోగొడుతుంది. నూతన ఆదాయ మార్గాలు కానవస్తాయి. ఖర్చులు కూడ అదుపు తప్పుతాయి. వ్యాపారులకు కొత్తభాగస్వాములు లభిస్తారు. కొత్తకాంట్రాక్టులు చేపడతారు. రాజకీయుల ప్రమేయంతో ఉద్యోగులు తమ పనులు సాగించుకొంటారు.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా

ఆరోగ్యవిషయంలో ఎలాంటి లోపం ఉండదు. భగవత్సంబంధమైన, మతపరమైన కార్యాలలో పాలు పంచుకొంటారు. సంతానం ప్రవర్తన మనస్తాపాన్నిస్తుంది. కుటుంబసభ్యులతో విరోధభావం చోటు చేసుకొంటుంది. ధనాదాయవిషయాలు చాలా తృప్తికరంగా ఉంటాయి. ఎదురు చూసిన మొత్తాలు అందుతాయి. స్పెక్యులేషన్ కూడ తోడవుతుంది. ఉద్యోగులకు ఒకమోస్తరుగా సాగుతుంది.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా. ఉత్తరాభాద్ర, రేవతి

పైత్యకోపం, బి.పి. బాధలు అధికం. హఠాత్పరిణామాలు ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. చిరకాలమిత్రుల చేరిక మనసుకు హాయినిస్తుంది. కొత్త బాంధవ్యాలు ఏర్పడవచ్చు. ఆర్థికవృద్ధికి కొత్త పథకాలు తయారు చేస్తారు. స్థిరాస్తులు చేర్చుకోను అధికంగా ఖర్చు చేస్తారు. భాగస్వామ్య వ్యాపారాలలో ఊహించని గొడవలు రావచ్చు. పెట్టుబడులను దారి మళ్లింప యోచన చేస్తారు.

## పంచాంగం

**శుభ ముహూర్తాలు**

3,4 తేదీలలో వివాహాదులకు
తె.3.00 నుంచి 4.00 గంటల వరకు
వృషభ లగ్నాన శుభ ముహూర్తాలున్నాయి.

**జూలై తిథులు**
**జ్యేష్ఠ బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 3 | శని | సప్తమి | పూర్తిగా | |
| 4 | ఆది | సప్తమి | ఉ.7.01 | గం.ల.వ |
| 5 | సోమ | అష్టమి | ఉ.8.38 | గం.ల.వ |
| 6 | మంగళ | నవమి | ఉ.9.37 | గం.ల.వ |
| 7 | బుధ | దశమి | ఉ.9.54 | గం.ల.వ |
| 8 | గురు | ఏకాదశి | ఉ.9.25 | గం.ల.వ |
| 9 | శుక్ర | ద్వాదశి | ఉ.8.12 | గం.ల.వ |

పి.ఎం.గోపాలాచారి
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com

# బ్లాకు, వీధి ఎదురు స్థలాలు 'దృష్టి'కోణ వేధలు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

నెల్లూరు లక్ష్మీరాజ్యం — అల్లీపురం

* *ఆగ్నేయ బ్లాకు స్థలం గృహం నిర్మించలేదు. ఉన్న ఇంటికి తూర్పు వీధి తగులుతున్నది.*

తూర్పు ఆగ్నేయం వీధిపోటు, ఖాళీగా వున్న స్థలం ఆగ్నేయవేధ రెండూ కలిస్తే స్త్రీ సమస్యలు తలెత్తుతాయి. రెండూ 'దృష్టి' కోణ వేధలు కలిగి వుంటాయి.

బైన పోచారెడ్డి — పొదలకూరు

* *ఇంటికి నైరుతి దిశలో ఖాళీ స్థలం వుంది. ఇంట్లో అనారోగ్యాలకే ఖర్చు అధికం.*

దీన్నే 'నైరుతి హెచ్చు దొడ్డి' అంటారు. ఆ స్థలాన్ని వెంటనే అమ్మి, ఈశాన్యంలో స్థలం లభ్యమైతే కొనండి. అనారోగ్యాలు తగ్గుతాయి. ఈలోగా సంబంధ యంత్ర ప్రతిష్ఠ చేయండి.

వేగుల అరుణమ్మ — చిత్తూరు

* *కోడలికి 'ట్రిపుల్ స్టార్' వుందని చెప్పారు. అంటే ఏమిటి?*

వేయి మందిలో ఒకరికి ఈవిధంగా వస్తుంది. 'శుక్రమహర్దశ' స్థితిలో గురు, బుధ స్థానాలు మిత్ర వర్గాలలో చేరుతాయి. ఈ సమయంలో సువర్ణ, ధన, ఆస్తి లాభాలు కలుగుతాయి. మీరనుకున్నవన్నీ పనికిమాలిన అంశాలు. అత్త బుద్ధి చూపించారు.

డా॥పి.వెంకటేశ్వరరావు — హైదరాబాద్

* *గృహ నిర్మాణ కార్యక్రమాలకు మంచి రోజులు చూసి చేయాలంటారు కదా?*

పై రోజుల్లో శంకుస్థాపన, ద్వార బంధన, గృహమూత పనులు చేయరు. ప్లాను రచన, స్థల సందర్శన మొదలైన పనులు చేసుకోవచ్చు. అభ్యంతరాలు లేవు.

వై.ఆర్.మధురిమ — చెన్నై

* *జాతకం రాయడానికి మేం ఇవ్వవలసిన అంశాలేమిటి?*

పుట్టిన తేది, సమయం, తల్లితండ్రులు, ఊరు పేరు, రెండు చేతులు ఇండియన్ ఇంకులో అద్దిన ముద్రలు, పూర్తిపేరు. ఇవి చాలు!

ఎం.పరాంకుశ శర్మ — కావలి

* *గృహ బాధ్యతలు నావే. నేను ఇంటికి యజమానిని. ఏ గదిలో నిద్రించాలి?*

వృద్ధులైనా సరే తల్లితండ్రులే యజమానులు. వారు నైరుతి గదిలో, మీరు వాయువ్యం గదిలో నిద్రించాలి. ఆవిడకు పగడం శ్రేష్ఠ శ్రేయస్కరం.

పి.రాజగోపాలరెడ్డి — కడప

* *పశువులన్నీ పోయాక ఆత్మీయుల్ని పోగొట్టుకున్నట్లు వున్నది?*

రైతుగా మీ ఆవేదన నాకర్థమయింది. యాంత్రిక యుగంలో పల్లె 'అంశాలన్నీ' స్మృతుల్లా ఇక మిగిలిపోతాయి. కశ్యప మహర్షి అంటారు కదా? పశువులు నడయాడని ప్రాంగణం ఎప్పటికీ 'లక్ష్మీ స్థితి'ని పొందజాలదు అని.

పడిగల సురేష్ — నెల్లూరు

* *మా పెద్దబ్బాయి వయసు 12 సంవత్సరాలు. ఎలా భ్రష్టుడైపోయాడో స్వయంగా చూశాను.*

తండ్రిగా మీ ఆవేదన అర్థమయింది. తూర్పు దోషాలు చాలా వున్నాయి. వాటిని సరిచేసుకోండి. వైఢూర్యం (సమశ్రేష్ఠ) కుడి చిటికెన వ్రేలికి ధరింపజేయండి. కుటుంబసభ్యులందరూ కూర్చుని ఫ్యామిలీ కౌన్సిలింగ్ ఇవ్వండి. ఈ రాశి వాళ్లని 'మంచితనం'తోనే మార్చాలి!

షేక్ పర్వీన్ — ఆత్మకూరు

* *దూలాల యిల్లు తీసివేసి శ్లాబు వేయాలనుకుంటున్నాను.*

అట్లా చేయడానికి ముందు వాస్తు యంత్ర ప్రతిష్ఠ చేయండి. వాస్తు సిద్ధాంతి సలహాలు తీసుకోండి.

మహ్మద్ సుబహాన్ — నెల్లూరు

* *'కోణవేధ' అంటుంటారు. అంటే ఏమిటి?*

ఎదురు, ప్రక్క గృహాల నిర్మాణాల కోణాలు నీచస్థానంలో వుంటే అవి మీ గృహం పైకి ఎక్కుపెట్టిన అస్త్రాలవుతాయి. అలాగే వీధులు కూడా.

ఎం.లలితాశర్మ — నెల్లూరు

* *అమ్మాయి ఆరోగ్యం వాస్తు సరిదిద్దుకొన్నాక, తాయత్తు ధరించాక బాగుపడింది.*

వాస్తు శాస్త్రీయం, తాయత్తు ఒక నమ్మకం. 'లక్ష్మీకృత వాస్తు యంత్ర' ప్రతిష్ఠ వల్ల మీ ఆర్థిక సంక్షోభం తొలుగుతుంది.

# తడ పంచాయితీలో అభివృద్ధి శూన్యం!



తడ గ్రామ పంచాయితీ కార్యాలయం.

తడ గ్రామ పంచాయితీ అభివృద్ధి పనులలో బాగా వెనుకబడిపోయింది. అధికారులు, ప్రజాప్రతినిధులు సైతం ఈ పంచాయితీ గురించి పట్టించుకోవడం లేదు. పంచాయితీ పరిధిలో అభివృద్ధి పనులు జరుగుతున్నట్లు చెబుతున్నా పరిశీలనలో మాత్రం ఎక్కడా కనిపించడం లేదు. త్రాగునీరు సరఫరా అంతంత మాత్రంగానే వుంది. పారిశుద్ధ్యం, డ్రైనేజీ కాల్వల నిర్మాణం చాలా అధ్వాన్నంగా వుంది. గ్రామ పంచాయితీ పాలకవర్గం ప్రజల నుంచి పన్నులు వసూలు చేసుకుంటుందే తప్ప సమస్యల పరిష్కారం కోసం ఎటువంటి కృషి చేయడం లేదు.

తడ గ్రామపంచాయితీ సర్పంచ్‌గా కాంగ్రెస్ పార్టీకి చెందిన కొమ్మల జయకృష్ణ ప్రాతినిధ్యం వహిస్తున్నాడు. ఈ పంచాయితీ పరిధిలో కొత్తకుప్పం, పల్లెపాళెం, సుజాతనగర్, ఎస్సీ, ఎస్టీ కాలనీలు వున్నాయి. వీటిలో 2వేల కుటుంబాలు, 7వేల జనాభా, 3వేల మంది ఓటర్లు వున్నారు. వివిధ పన్నులు, ఎస్.ఎఫ్.సి, 12వ ఆర్థిక సంఘం నిధులు కలిపి దాదాపు లక్షా50వేల వరకు సమకూరుతుంటాయి. ఈ గ్రామ పంచాయితీ సూళ్ళూరుపేట అసెంబ్లీ నియోజకవర్గ పరిధిలో వుంది.

పంచాయితీ సర్పంచ్ కాంగ్రెస్ పార్టీకి చెందిన వారు కావడం, ఎమ్మెల్యే పరసారత్నం తెలుగుదేశం పార్టీకి చెందినవారు కావడం వలన పంచాయితీ అభివృద్ధికి ఆశించిన మేర నిధులు మంజూరు కావడం లేదన్న విమర్శలు వున్నాయి. జాతీయ గ్రామీణ ఉపాధిహామీ పథకం క్రింద 10 లక్షల రూపాయల పనులు మంజూరయ్యాయి. ఈ పనులు ఎక్కడ చేపట్టాలనేది ఇంకా ఖరారు కాలేదు. పలు కాలనీలలో అంతర్గత రోడ్ల నిర్మాణం చేపట్టలేకపోవడంతో ప్రజలు ఇబ్బంది పడుతున్నారు.

జాతీయ రహదారికి ఆనుకుని వున్నప్పటికి కేవలం బజారు సెంటర్లో మాత్రమే సిమెంటు రోడ్డు నిర్మాణం చేపట్టారు. మిగిలిన రోడ్ల గురించి అసలు పట్టించుకునే దిక్కు లేకుండా పోయారు. ప్రజలను ప్రధానంగా త్రాగునీటి సరఫరా పట్టిపీడిస్తుంది. ఓవర్‌హెడ్ ట్యాంకుల నుంచి ప్రతిరోజు త్రాగునీరు సక్రమంగా విడుదల జరగడం లేదు. రెండురోజులకోసారి నీటిని విడుదల చేస్తున్నారని స్థానికులు చెప్పారు. గ్రామ పంచాయితీ సర్పంచ్ ఎన్నికై నాలుగున్నర సంవత్సరాలు కావస్తున్నా పంచాయితీలోని ప్రధాన సమస్యలను పరిష్కరించడంలో పూర్తిగా విఫలం చెందాడు.

త్వరలో స్థానిక సంస్థల ఎన్నికలు జరుగనున్నాయి. ఈ క్రమంలోనైనా పంచాయితీలో కొంతమేర అభివృద్ధి పనులు చేపడితే ప్రజల మన్ననలు పొందవచ్చు. ఇక్కడ తెలుగుదేశం, కాంగ్రెస్ పార్టీలకు చెందిన నేతలు ఎవరు కూడా పంచాయితీ రాజకీయాలపై పెద్దగా ఆసక్తి కనపరచడం లేదు.

**నిధుల కొరత వుంది!**

మా గ్రామ పంచాయితీలో అభివృద్ధి పనులు చేపట్టేందుకు నిధుల కొరత తీవ్రంగా వుంది. త్రాగునీటి సరఫరా, డ్రైనేజీ కాల్వల నిర్మాణం, సిమెంటు రోడ్ల నిర్మాణం తదితర పనులు చేపట్టాల్సి వుంది. పంచాయితీ సాధారణ నిధులతోనే ప్రస్తుతానికి నెట్టుకొస్తున్నాం. ప్రభుత్వం నుంచి నిధులు మంజూరైతే మరిన్ని అభివృద్ధి పనులు చేపడతాం.

– కె.జయకృష్ణ, సర్పంచ్


రూపురేఖలు లేని రోడ్లు.

**అవినీతి కథ**

## ● పేదలకిచ్చిన స్థలాలు అమ్మి

# సొమ్ము చేసుకొంటున్న కార్పొరేటర్!

**నెల్లూరు నగర శివారులోని నవలాకుల తోటలో పేదలకు ప్రభుత్వం కేటాయించిన ఇంటి స్థలాలకు సంబంధించిన పట్టాలు నాల్గవ డివిజన్ కార్పొరేటర్ సంక్రాంతి కళ్యాణ్ తన వద్దే వుంచుకొని ఓ పద్ధతి ప్రకారం అమ్ముకొంటున్నాడు.**


కార్పొరేటర్ సంక్రాంతి కళ్యాణ్ తనదిగా అమ్మేస్తున్న ప్రభుత్వ భూమి.

అధికార పార్టీ నేతల అండదండలు, అధికారుల అవినీతి, అక్రమాల కారణంగా ప్రభుత్వ స్థలాలను కబ్జాదారులు ఆక్రమించేస్తున్నారు. సామాన్య ప్రజలు నివాసం వుండేందుకు జానెడు ప్రభుత్వ స్థలంలో పూరి గుడిసె వేసుకుంటే ఆఘమేఘాలపైన వెళ్లి వాటిని జెసిబిలతో తొలగిస్తుంటారు రెవిన్యూ అధికారులు. అదే స్థలాన్ని కబ్జాదారులు దురాక్రమిస్తే ఆ విషయం తెలిసినా ఆ వైపు కన్నెత్తి కూడా చూడరు. నెల్లూరు నగరంతోపాటు శివారు ప్రాంతాలలో వున్న ప్రభుత్వ స్థలాలు సైతం ఆక్రమణలకు గురవుతూనే వున్నాయి. పేద ప్రజలకు అండగా నిలవాల్సిన అధికారులు, ప్రజాప్రతినిధులు వారి స్థలాలనే కాజేస్తున్న సంఘటనలు అనేకం జరుగుతున్నాయి.

ముఖ్యంగా నెల్లూరు నగరంలో ఇటువంటి సంఘటనలు ఎక్కువైపోయాయి. దీనివల్ల మునిసిపల్, ఇరిగేషన్ శాఖలకు చెందిన ఖాళీ స్థలాలు కనుమరుగైపోతున్నాయి. రెవిన్యూ అధికారులు రాజకీయ, అధికార బలానికి తలొగ్గి పేదల కడుపులు కొడుతున్నారు. భూకబ్జాదారులకు నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ఆశీస్సులు వుండడంతో ఖాళీ స్థలాలు దురాక్రమించేస్తున్నారు. ఇంతకు ముందు మునిసిపల్ కార్పొరేషన్ సమీపంలో కార్పొరేటర్ చిన్న పెంచలయ్య 50 అంకణాల స్థలాన్ని దురాక్రమించి పక్కా భవనాన్ని నిర్మించడం జరిగింది.

మరో కార్పొరేటర్ సందాని బాష అనుచరులు, బంధువులు మునిసిపాల్టీకి సంబంధించిన క్వార్టర్స్‌ను ఆక్రమించి వాటి స్థానంలో షాపింగ్ కాంప్లెక్స్ నిర్మాణం చేపట్టారు. తాజాగా కాంగ్రెస్ పార్టీకి చెందిన సంక్రాంతి కళ్యాణ్ అనే కార్పొరేటర్ పేదల పేరుతో పంపిణీ చేసిన స్థలాలను విక్రయించేందుకు ప్రయత్నాలు సాగిస్తున్నాడు. నెల్లూరు శివారులో వున్న నవలాకుల గార్డెన్ సమీపంలో అనేక మంది పేదలకు ఇళ్ల స్థలాలు కేటాయించడం జరిగింది. కేటాయించిన స్థలాలకు సంబంధించిన పట్టాలు కార్పొరేటర్ సంక్రాంతి కళ్యాణ్ తన వద్ద వుంచుకొన్నాడు. వీటిని ఆధారంగా చేసుకొని స్థలాలను విక్రయించే పనిలో నిమగ్నమైవున్నాడు.

ఇక్కడ కేటాయించిన ఇళ్ల స్థలాలు ఎవరి పేరు మీద వున్నాయో కూడా తెలియని పరిస్థితి నెలకొని వుంది. ఈ వ్యవహారమంతా ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి అండతోనే చేస్తున్నాడు. కాంగ్రెస్ కార్పొరేటర్లలో సంక్రాంతి కళ్యాణ్‌కు ఎమ్మెల్యే అధిక ప్రాధాన్యత ఇస్తున్నాడని తోటి కార్పొరేటర్లు గుసగుసలాడుకుంటున్నారు. ఎక్కడ ఖాళీ స్థలాలు వుంటే అక్కడ ఈ కార్పొరేటర్ వాలిపోతుంటాడు. సంక్రాంతి కళ్యాణ్‌పై అనేక ఆరోపణలు, విమర్శలు వచ్చినప్పటికీ వాటిని ఏమాత్రం పరిగణలోకి తీసుకోకుండా మరిన్ని అక్రమాలకు పాల్పడే విధంగా ఎమ్మెల్యే సహకరిస్తున్నాడన్న ప్రచారం జరుగుతుంది. గతంలో తుఫాన్ సంభవించినప్పుడు ఇళ్లు కూలిపోయిన వారి పేర్లతో లక్షలాది రూపాయల సాయాన్ని స్వాహా చేశాడు. అప్పట్లో దాదాపు 30 లక్షల రూపాయల వరకు వరద సాయాన్ని స్వాహాచేసిన విషయం గుప్పుమన్నా అతనిపై ఎటువంటి చర్యలు తీసుకోలేదు. తాను ఏం చేసినా ఎమ్మెల్యే వివేకానందరెడ్డి సహకారం వుంటుందన్న ధీమాతో ప్రభుత్వం పేదలకు పంపిణీ చేసిన ఇళ్ల స్థలాలను అధిక ధరలకు విక్రయించేందుకు పథకం పన్నాడు సంక్రాంతి కళ్యాణ్. పేదలకు పంపిణీ చేసిన ఇళ్ల స్థలాలను విక్రయించే ప్రయత్నాలను అడ్డుకోవాల్సిన రెవిన్యూ అధికారులు, సిబ్బంది ఆ దిశగా ప్రయత్నించడం లేదు. గతవారం కల్లూరుపల్లిలో కొంత మంది పేదలు ప్రభుత్వ స్థలంలో నివాసాలు ఏర్పాటు చేసుకుని జీవనం సాగిస్తుంటే వాటిని ధ్వంసం చేశారు. నవలాకుల గార్డెన్‌లో పేదలకు పంపిణీ చేసిన స్థలాలను కార్పొరేటర్ విక్రయిస్తుంటే ఏం చర్యలు తీసుకుంటారన్నది ప్రశ్న.

లక్షలాది రూపాయలు విలువచేసే స్థలాలను భూకబ్జాదారుల నుంచి కాపాడాల్సిన పాలకులు, అధికారులు మామూళ్లు తీసుకుంటూ పరోక్షంగా సహకారం అందిస్తున్నారన్న విమర్శలు లేకపోలేదు. ఇప్పటికైనా జిల్లా కలెక్టర్ ఈ సమస్యపై దృష్టిసారించి పేదలకు చెందాల్సిన ఇళ్ల స్థలాలను విక్రయాలు జరుపకుండా చర్యలు తీసుకోవాల్సిన అవసరం లేదంటారా?





## అధరాలకు ఆపరేషన్

ఏక్‌నిరంజన్ చిత్రంలో హీరోయిన్ కంగనా రనౌత్ ఆ మధ్య షూటింగ్‌లో దెబ్బ తగిలి కొంతకాలం విశ్రాంతి తీసుకొంది. గతంలో బక్క పలచగా వుండే కంగనా ఇప్పుడు కొంచెం ఒళ్లు చేసింది. ఇదంతా ఒక ఎత్తు. ఈమె వ్యక్తిగతమైన ఇంకో విషయం చెప్పుకోవాలి. ఈ అమ్మడు తన పెదాలకు ప్లాస్టిక్ సర్జరీ చేయించుకొందని ముంబైలో గుప్పుమంటుంది. ఇదే విషయాన్ని ఇటీవల హైదరాబాద్ వచ్చిన ఆమెను అడిగితే మీరన్నట్లు సర్జరీలతో అందాన్ని సరి చేసుకొనే అవసరం నాకు లేదు. రోజూ జిమ్ కెళ్లటం, నిత్యం యోగా చేయడం తన అలవాటంది.

## దీక్ష సేథ్ ఆకాంక్ష

వేదం సినిమాలో అల్లు అర్జున్ సరసన హీరోయిన్‌గా నటించిన దీక్షసేథ్‌కు మంచి గుర్తింపు వచ్చింది. దీంతో రవితేజ సరసన 'మిరపకాయ్' చిత్రంలో నటించే అవకాశం వచ్చింది. ఈ షూటింగ్‌గ్యాప్‌లో పిచ్చాపాటీగా మాట్లాడింది. నేను పంజాబీ అమ్మాయిని. ముంబాయిలో బికామ్ ఆనర్స్ చదివాను. మిస్ ఇండియా 2009 పోటీల్లో పాల్గొన్నాను. మిస్ ఫ్రెష్‌ఫేస్ ఆఫ్ ది ఇయర్ అవార్డుల కార్యక్రమ వేదికపై మాడలింగ్ చేశాను. అక్కడ క్రిష్ నన్ను చూసి వేదం సినిమాలో పరిచయం చేశారు. నాకు ప్రత్యేక లక్ష్యాలేమి లేవు. తొందరగా తెలుగు ప్రేక్షకుల ఆదరణ పొందితే చాలంటుంది.





## మహేష్‌బాబులో దైవభక్తి!

తన పనేదో తాను చేసుకుపోయే హీరోగా పరిశ్రమలో పేరుగాంచిన మహేష్‌బాబుకి భక్తి కూడా ఎక్కువేనట. ఈ మధ్య తీరిక దొరికితే పుణ్యక్షేత్రాల్ని దర్శించుకోవడానికి ఆసక్తి చూపిస్తున్నాడట. ప్రస్తుతం మహేష్‌బాబు త్రివిక్రమ్ శ్రీనివాస్ దర్శకత్వంలో ఓ సినిమా చేస్తున్నాడు. పతాక సన్నివేశాల చిత్రీకరణ పూణేలో జరుగుతుంది. అక్కడ షూటింగ్ లేనప్పుడు వీలు చేసుకొని దగ్గర్లో వున్న గుళ్లు గోపురాలు చుట్టొస్తున్నాడు. ఈ విషయాలన్ని ఆయన తన ట్విట్టర్‌లో వ్రాసుకొన్నాడు.

## ఏదైనా చేస్తాను

జీవితమే పెద్ద నటన. అలాంటిది నటించమంటే ఊరికే వుంటామా? జీవించేస్తానంటోంది బాలీవుడ్ భామ నేహాధూపియా. ఎలాంటి పాత్రలు చేయాలని వుంది? మనసు పెట్టి చేయాలే కానీ సాధ్యం కానిదంటూ ఏమీ వుండదు. అది క్లాసా... మాసా అనే తేడా వుండదు. మనకు పేరు వస్తుందంటే ఎలాంటి పాత్రకైనా సై అంటాను. గతంలో ఎన్నో మంచి పాత్రల్లో నటించాను. మంచి పేరొచ్చింది. యువకులను కవ్వించే ఐటమ్ పాటలే కాదు. వినోద భరిత పాత్రల్ని కూడా పోషించాను. నేను ఏదైనా చేయగలను. కానీ నన్ను ఉపయోగించుకునే విధానం దర్శకులకు తెలియాలంటుంది.

## పెళ్లికాని ఆలు మగలం!

బాలీవుడ్ నటులు జాన్ అబ్రహం, బిపాసబసులు నిత్యం వార్తల్లో వుంటారు. వీళ్లిద్దరూ ప్రేమికులా? స్నేహితులా! భార్యా, భర్తలా? లేదంటే కేవలం సహ నటులా? అని వీరినే అడిగితే ఆడ మగ మధ్య ఎన్నిరకాల బంధాలుంటాయో అన్నీ మా మధ్య వున్నాయని ఇద్దరూ ఒక్క మాటగా చెబుతున్నారు. భార్యా భర్తలు కావడానికి పెళ్లే కానక్కరలేదు. పెళ్లైన వారందరూ భార్యా, భర్తలుగా జీవించడం లేదనేది వీరి బలమైన అభిప్రాయం. సమయం వచ్చినప్పుడు తప్పకుండా పెళ్లి చేసుకుంటాము. చేసుకోకపోయినా ప్రస్తుతం సంతోషంగానే వున్నామని చెప్పుకొచ్చారు.





## పప్పులుడకలేదు!

అల్లూరు రహీం

వినాయకుడు, విలేజ్‌లో వినాయకుడు చిత్రాలతో ప్రత్యేక గుర్తింపు తెచ్చుకొన్న కృష్ణుడిని మళ్లీ హీరోను చేసి ఆర్య ఎంటర్‌టైన్‌మెంట్ పతాకంపై తీసిన చిత్రమే పప్పు. వినోద ప్రధానంగా ఈ చిత్రాన్ని మలచాలన్న ప్రయత్నాన్ని ప్రారంభించిన కథకుడు, స్క్రీన్‌ప్లేతోపాటు దర్శకత్వ బాధ్యతలు చేపట్టిన సపన్ పసుపర్తి పలు మెలికలు తిప్పాడు. కానీ ఈ ప్రయోగాలన్నీ విఫలమయ్యాయి. వెకిలి హాస్యాన్ని హాస్యమనలేం. లావుగా వుండే కృష్ణుడు ప్యాంట్ చిరగడం, ఆఫీసులో సహచరులు అతని పొట్టపై గుద్దడం వ్యక్తిత్వ హననమే. అయితే పప్పుకు పది తలలు మొలచినట్లు గ్రాఫిక్స్‌లో చూపడం, వస్తున్న నిద్రను ఆపుకోను కళ్లకు అగ్గిపుల్లలు అడ్డుగా పెట్టుకోవడం, మేల్కొటే, గుండు హనుమంతరావు ఒక్క సన్నివేశంలో కనపడ్డా మంచి హాస్యాన్ని అందించారు. చిత్రం సగంలో కృష్ణుడితో కథ నడపలేమని భావించిన దర్శకుడు సుబ్బరాజును డిటెక్టివ్ పాత్రలో దింపాడు. చివరికి అతని మరణ సన్నివేశంలో సెంటిమెంట్ పండించే ప్రయత్నం చేశాడు. ఈ చిత్రంలో ముఖ్య పాత్రధారి బెనర్జీ ప్రతి చిన్న విషయానికి ఓ స్వామీజీ సలహా అడగడం ఈ మధ్య సొసైటీలో పెరిగిపోయిన ఈ విధానాన్ని ఎండగట్టను దర్శకుడు ఉపయోగించుకొన్నట్లుంది. అయితే ఈ చిత్రంలో ఫణి కళ్యాణ్ స్వరాలు కూర్చిన ఘల్... ఘల్..., మాయలేడి పిల్ల మాయలేడి, అయ్యో... అయ్యో పాటలు బాగున్నాయి. దర్శకుడు సపన్ వ్రాసిన మాటల్లో లక్ అనేది దక్కదు... మనమే దక్కించుకోవాలి. దేశంలో వంద కోట్ల మంది వుంటే కనీసం వందమందితో కూడా స్నేహం చేయలేని జీవితమెందుకు అనే డైలాగులు ఆలోచింపజేస్తాయి. ఈ చిత్రంలో కృష్ణుడు పాత్ర స్వభావాన్ని అల్లరి నరేష్ చేత స్వగతంలో చెప్పిస్తారు. ఈ మధ్య తెలుగు చిత్రాల హీరోల గొప్పతనాన్ని మరో హీరో గొంతుతో చెప్పిస్తున్నారు. ఇదేం వెరైటీనో?

చిత్రకథలోనికి వెళ్తే పప్పు(కృష్ణుడు) పరమ దురదృష్టవంతుడు. బాగా లావుగా వుండే అతను ఏ పని చేయాలన్నా ఇబ్బందులు ఎదుర్కొంటుంటాడు. దీనికితోడు గ్రహబలం అనుకూలించదు. లింగరాజు (బెనర్జీ) కంపెనీలో అకౌంటెంట్‌గా చేరే అతను ఆ ఆఫీసులో కొత్తగా బాధ్యతలు తీసుకొన్న ఆయన కుమార్తె రాధ(దీపిక) పట్ల ప్రత్యేక ఆరాధన పెంచుకొంటాడు. ఓ పార్టీకి వెళ్లి వస్తుండే రాధను కొందరు వ్యక్తులు కిడ్నాప్ చేస్తారు. వంద కోట్లు ఇస్తే విడుదల చేస్తామంటారు. ఆఫీసు మేనేజర్ చిదంబరం(ఉత్తేజ్) సలహాపై కిడ్నాప్‌ను ఛేదించే బాధ్యతలు ప్రైవేట్ డిటెక్టివ్ రామ్(సుబ్బరాజు)కు అప్ప చెపుతారు. ఓ స్వామిపై లింగరాజుకు విపరీతమైన గురి. స్వామి సలహాపై రాధ రక్షింపబడాలంటే గ్రహబలం ఏమాత్రం లేని పప్పును వెతికే పనిలో భాగస్తుడిని చేయమంటాడు. దీంతో రామ్‌తో పప్పు బయలు దేరుతాడు. చిత్రవిచిత్రమైన సందేహాలతో పప్పు రామ్‌ను ఏపుక తింటాడు. లింగరాజు ఇంట్లో పనిచేసే డ్రైవర్ ద్వారా రాధ కిడ్నాప్‌పై కొంత సమాచారం దొరుకుతుంది. ఓ దాబా దగ్గర రాధను చూసిన డాక్టర్ మరి




కొంత సమాచారం అందిస్తుంది. రాధను కిడ్నాప్ చేయమంది ఆమె బాబాయి సింగరాజు(సూర్య) అని తెలుసుకొంటారు. కిడ్నాపర్లతో జరిగిన గొడవలో రామ్ ప్రాణాలు పోగొట్టుకొంటాడు. దీన్ని భరించలేని పప్పు ఆంజనేయస్వామి విగ్రహం ముందు ఆయన పూనినట్లుగా రెచ్చిపోయి కిడ్నాపర్లను అంతమొందిస్తాడు. రాధకు పప్పులోని నిజాయితీ నచ్చుతుంది. తన తండ్రి లింగరాజుకు చెప్పి అతన్ని వివాహం చేసుకోవడంతో పప్పు కష్టాలన్నీ తీరి చివరికి అదృష్టవంతుడవడంతో సినిమా ముగుస్తుంది.

పప్పుగా కృష్ణుడు కష్టపడ్డాడు. భారీ శరీరంతో ఫైటింగులలో నానాతిప్పలు పడ్డాడు. డిటెక్టివ్ పాత్రను సుబ్బరాజు చక్కగా పోషించాడు. హీరోయిన్ దీపిక తొలి పరిచయంలో ప్రేక్షకులను ఆకట్టుకోలేదు. పప్పు చిత్రంతో పరిశ్రమలో నిలదొక్కుకోవాలన్న దర్శకుడు సపన్ పప్పులుడకలేదనాలి. 

## స్టాఫ్ నర్సుల కొరత

రెండేళ్లుగా వైద్య ఆరోగ్య శాఖలో స్టాఫ్ నర్సుల పోస్టులను భర్తీ చేయడం లేదు. ప్రధాన ఆసుపత్రులలో వైద్యసేవల్లో కీలకపాత్ర వహించే నర్సులు పూర్తిస్థాయిలో లేకపోవడంతో వైద్య సేవలు కుంటుపడుతున్నాయి. జిల్లావ్యాప్తంగా మొత్తం 61 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, కమ్యూనిటీ హెల్త్ సెంటర్‌లలో స్టాఫ్ నర్సుల కొరత వుంది. ఇక్కడ ప్రస్తుతం 100 మంది మాత్రమే పనిచేస్తుండగా, ఇంకా 70 మంది వరకు అవసరం వుంది. కొన్ని ఆరోగ్య కేంద్రాలలో అసలు స్టాఫ్ నర్సులే లేరు. దీనివల్ల అత్యవసరసమయాల్లో ఇబ్బందులు ఎదురౌతున్నాయి. ఎఎన్ఎంలు వున్నా శస్త్రచికిత్సలు, ఇతర అత్యవసర,



పెద్దాసుపత్రిలో బాగా తగ్గిన స్టాఫ్ నర్సులు.

కీలక సందర్భాలలో స్టాఫ్ నర్సుల పాత్ర ప్రాధాన్యత కల్గింది. రోడ్డు ప్రమాదాలు సంభవించినపుడు వీరి అవసరం చాలా వుంటుంది. అలాంటిది కోట పిహెచ్‌సి 24 గంటలు అందుబాటులో వుంటున్నా ఇక్కడ ఒక్క నర్సులేదు. దక్కిలి మండల కేంద్రంలోనూ ఇదే పరిస్థితి. ఉదయగిరి మేజర్ కమ్యూనిటీ హెల్త్ సెంటర్‌లో ఆరుగురు స్టాఫ్ నర్సులు అవసరం కాగా ఒక్కరూ లేరు. జిల్లాలోని పలు ప్రాంతాలలో నర్సుల కొరత వుంది. జిల్లాలో ఖాళీగా వున్న నర్సుల పోస్టుల భర్తీకి సంబంధించి 2007లో నోటిఫికేషన్ విడుదల చేశారు. దరఖాస్తులు అధిక సంఖ్యలో వచ్చాయి. గుంటూరు ప్రాంతీయ ఆరోగ్య సంచాలకులు వీటిని భర్తీ చేయాల్సిన సమయంలో కొందరు ఈ నియామకాలను వ్యతిరేకిస్తూ కోర్టుకు వెళ్లడంతో నియామకాలకు బ్రేక్ పడింది. గత నెలలో హైకోర్టు స్టాఫ్ నర్సుల ఖాళీల భర్తీకి గ్రీన్‌సిగ్నల్ ఇచ్చినా ఇంతవరకు అధికారులు ఎలాంటి చర్యలు చేపట్టలేదు.

## సంగీత పాఠశాలలో సమస్యల రాగం

ఎందరో కళాకారులకు జన్మనిచ్చిన సింహపురి సీమలో ఉన్నత ఆశయంతో ఏర్పాటుచేసిన ప్రభుత్వ సంగీత నృత్య పాఠశాల సౌకర్యాల లేమి, అధ్యాపకుల కొరతతో కునారిల్లుతోంది. అద్దె భవనంలో కొనసాగుతున్న ఈ పాఠశాలకు సొంత భవనం నిర్మించి సౌకర్యాలు మెరుగుపర్చాలని నగరవాసులు పలుమార్లు విన్నవించుకొన్నప్పటికీ ప్రయోజనం లేకుండా పోయింది. ప్రస్తుతం నాలుగు సంవత్సరాల వ్యవధిగల సర్టిఫికేట్ కోర్సుల్లో మాత్రమే శిక్షణనిస్తున్నారు. ఆరేళ్ల కాలపరిమితి గల డిప్లమో కోర్సులు చేయాలంటే తిరుపతి తదితర ప్రాంతాలకు వెళ్లాల్సి వస్తోంది. నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి మంత్రిగా వున్నప్పుడు కోట



నెల్లూరులోని సంగీత పాఠశాల.

గ్రామంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక శాఖ ఆధ్వర్యంలో సంగీత నృత్య పాఠశాలను ఏర్పాటు చేశారు. నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి ముఖ్యమంత్రిగా వున్నప్పుడు బెజవాడ గోపాలరెడ్డి కోరిక మేరకు దీనిని నెల్లూరు నగరానికి తరలించారు. ఆర్టీసి వద్దనున్న అద్దె భవనంలో నడుస్తున్న ఈ పాఠశాలలో భరతనాట్యం, వీణ, వేణువు, మృదంగం, వయొలిన్, గాత్ర శిక్షణనిస్తారు. భవన నిర్మాణం సౌకర్యాల కల్పనపై మంత్రి రామనారాయణరెడ్డి హామీ ఇచ్చినా అది ఆచరణకు రాలేదు. ఇటీవల నగరానికి వచ్చిన సాంస్కృతిక శాఖ కార్యదర్శి చెల్లప్ప దీనిపై తగిన హామీ ఇవ్వలేక పోయారు. మూడేళ్ల క్రిందట జరిగిన అటా ఉత్సవాల్లో మెగా సాఫ్ట్ అధినేత రవి సన్నారెడ్డి సంగీత పాఠశాల అభివృద్ధి కోసం ఇచ్చిన కోటి రూపాయలు ఏమయ్యాయో అంతు చిక్కడం లేదు. అటు అధికారులు, ఇటు పాలకులు ఈ మొత్తం గురించి మాట్లాడకపోవడం పలు అనుమానాలకు తావిస్తోంది.

## పారిశుధ్యం పట్టదా?

నిన్నమొన్నటి వరకు మండుతున్న ఎండలతో విలవిల్లాడిన జిల్లా ప్రజలకు ఇప్పుడు అంటురోగాల భయం పట్టుకొంది. రుతుపవనాల తాకిడికి చెదురుమదురుగా వర్షాలు కురుస్తుండడంతో వాతావరణంలో మార్పు చోటు చేసుకోవడంతో ప్రజలు అనారోగ్యానికి గురౌతున్నారు. పారిశుధ్యం క్షీణిస్తుండడంతో ప్రజలు అంటురోగాల బారిన పడుతున్నారు. పారిశుధ్యం మెరుగుపరిచేందుకు ప్రభుత్వం నుంచి కోట్ల రూపాయల నిధులు విడుదలవుతున్నా జిల్లాలో ఎక్కడా పారిశుధ్యం మెరుగుపడలేదు. ప్రభుత్వం నుంచి జిల్లాకు 12వ ఆర్థిక సంఘం నిధులు గత ఏడాదికి 50



పెద్దాసుపత్రి పరిసరాల్లో పేరుకొన్న చెత్త.

కోట్ల మేర మంజూరయ్యాయి. గ్రామాల్లో పారిశుధ్యం అభివృద్ధి చేసేందుకు 30 కోట్లు, నెల్లూరు నగర పాలక సంస్థకు 15 కోట్లు, కావలి మునిసిపాల్టీకి 2.5 కోట్లు, గూడూరు మునిసిపాలిటీకి 1.5 కోట్లు, వెంకటగిరికి 50 లక్షల రూపాయలు మంజూరయ్యాయి. స్థానిక సంస్థల బడ్జెట్‌లో కోట్ల రూపాయలు వైద్య ఆరోగ్య శాఖ ద్వారా 50 లక్షల రూపాయలు మంజూరు చేసినప్పటికీ ఎక్కడా పారిశుధ్యం మెరుగుపడిన దాఖలాల్లేవు. అధిక భాగం నిధులు దుర్వినియోగం కావడంతో పాలకులు, కొందరు అవినీతి అధికారుల జేబుల్లోకి వెళ్లడంతో పారిశుధ్యం క్షీణించి అంటురోగాలకు గురికావాల్సి వస్తోంది. మురికినీటి నిల్వలు, చెత్తకుప్పల కారణంగా దోమలు విజృంభించి మలేరియా, డెంగ్యూ, చికున్‌గున్యా వ్యాధులతోపాటు కలుషిత నీటి సరఫరా కారణంగా అంటురోగాలు ప్రబలుతున్నాయి.

## అపార్ట్‌మెంట్ల నిర్మాణ రంగంలో మురళీకృష్ణ!

### హోటళ్ల మాదిరి అభివృద్ధి చెందాలని అతిథుల ఆశీర్వాదం

ఇటు మాంసాహార, అటు శాఖాహార భోజన హోటళ్లు, స్వీట్ షాపు నిర్వహణతో నెల్లూరీయుల మనసు దోచిన మురళీకృష్ణ గోపాలయ్య మనుమడు చైతన్యకృష్ణ అపార్ట్‌మెంట్ల నిర్మాణ రంగంలో ప్రవేశించారు. హరనాథపురంలోని పినాకినీ నగర్‌లో మురళీకృష్ణ ఎన్‌క్లేవ్ పేరిట అపార్టుమెంటు నిర్మాణానికి నడుం బిగించారు. దీనికి సంబంధించిన బ్రోచర్‌ను 27వ తేది మినీ బైపాసు రోడ్డులోని మహేశ్వరి కళ్యాణ మండపంలో విడుదల చేశారు. ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, మేయర్ భానుశ్రీ, మురళీకృష్ణ గోపాలయ్య, హజరత్‌బాబు, సుబ్బారావు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ సందర్భంగా రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి మాట్లాడుతూ మురళీకృష్ణ గోపాలయ్య నెల్లూరీయులకు మంచి భోజనం పెట్టారని, ఆయన కుమారులు లెక్కలు వ్రాసి సంస్థలను అభివృద్ధి చేస్తే మనమళ్లు ఇంటి నిర్మాణ రంగంలోనికి రావడం అభినందనీయమన్నారు. నెల్లూరులో మరో మూడేళ్ల తర్వాత ఇళ్లు దొరకడమే కష్టమవుతుందన్నారు. ఈ ప్రాజెక్ట్ డైరక్టర్ చైతన్యకృష్ణ ఉన్నతిని ఎమ్మెల్యే కాంక్షించారు. బ్రోచర్ విడుదలకు ముందు బి.వి.నరసింహం వ్యాఖ్యాతగా కళాంజలి ఆర్కెస్ట్రా వారు నిర్వహించిన కార్యక్రమాలు అలరించాయి.



మురళీకృష్ణ ఎన్‌క్లేవ్ బ్రోచర్‌ను విడుదల చేస్తున్న శాసనసభ్యులు వివేకానందరెడ్డి, శ్రీధర్‌కృష్ణారెడ్డి, మురళీకృష్ణ గోపాలయ్య, హజరత్ బాబు, మేయర్ భానుశ్రీ, చైతన్యకృష్ణ.

## జనార్దనరెడ్డి

16వ పేజీ కొరవ

కాంగ్రెస్ భక్తికి అదొక శాశ్వత చిహ్నంగా నిలిచిపోయింది. ఆ కారణంతోనే చిన్నదనే సంకోచం పాటించకుండా, ఆయన అభినందన సభ ఇక్కడే జరపాలని నిర్ణయించారు నిర్వాహకులు.

### మంత్రులు లేకుంటే మునిగిందేమీ లేదు!

ఆరుగురు మంత్రులు పాల్గొనేట్లు ఏర్పాట్లు జరిగాయి. ఇద్దరు మాత్రమే వచ్చారు. తతిమా వారిని పోవద్దని పలురకాల ప్రాధేయపడ్డారు ఆనం సోదరులు. నెల్లూరుకు రానుపోను ప్రయాణ ఏర్పాట్లు చేసుకొన్నవారిని కూడా బలవంతంగా నిలవేశారు. గల్లా అరుణకుమారి, గీతారెడ్డి, బొత్స సత్తిబాబు, పార్థసారధి ఆనం వారి మొగమాటానికి లొంగి, నెల్లూరు రాలేదు. అయితే మంత్రులు రానంత మాత్రాన అక్కడ మునిగిందేమీ లేదు. ఆ లోటు ఏ మాత్రం కన్పించలేదు.

### పిచ్చికుక్క నైజం

ఆనం వారి నీచబుద్ధి బయటపడడం తప్ప జరిగిన నష్టమేమీ లేదు. జనార్దనరెడ్డి మరొకసారి రాజకీయంగా వెలుగులోకి రావడం వారికి సహ్యం కావడం లేదు. ఆయనకు ఈ రాజ్యసభ సభ్యత్వం రాకుంటే జిల్లాను తాము ఏలుకోవచ్చునని కలలు కన్నారు. అది జరగకపోయేసరికి మతి తప్పి వ్యవహరిస్తున్నారు.

నిజం మాట్లాడాలంటే ఈ సభను ముందుండి నడిపించవలసిన వారు ఆ అన్నదమ్ములే. వారికి రాజకీయ భిక్ష పెట్టినవాడు జనార్దనరెడ్డి. ఆయన దయ వల్లనే మునిసిపల్ ఛైర్మన్లయ్యారు. ఎమ్మెల్యేలుగా అవకాశం పొందారు. అసలు కాంగ్రెస్ ప్రవేశం సైతం ఆయన దయా ధర్మం. జనార్దనరెడ్డి వద్దు అంటే, వారిని పార్టీలోకి తీసుకొనే వారు లేరు. ఈరోజు ఈ అధికార మదమూ లేదు. అన్నం పెట్టిన వాడి చేతిని కరిచే పిచ్చి కుక్క బుద్ధి వారిది. ఆ ఖర్మ వారే అనుభవిస్తారు.

### రాజీవ్‌భవన్‌కు అవకాశం

ఆనం వారు పక్కకు తప్పుకోవడంతో ఆ అవకాశాన్ని రాజీవ్‌భవన్ నిర్వాహకులు దక్కించుకొన్నారు. సద్వినియోగం చేసుకొన్నారు. సభను చాలా చక్కగా నడిపించారు. భవనం మొత్తం జనంతో తొక్కిడిగా మారినా క్రమశిక్షణ తప్పలేదు. వేదిక మీద తోపులాటలు, తన్నులాటలు లేవు. రెవిన్యూ మంత్రి ధర్మాన ప్రసాదరావు, జిల్లా ఇన్‌ఛార్జి మంత్రి మోపిదేవి వెంకటరమణ, మాజీ మంత్రులు జెసి. దివాకర్‌రెడ్డి, నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ, ఎమ్మెల్యేలు ఆదాల ప్రభాకర్‌రెడ్డి, మేకపాటి శేఖర్‌రెడ్డి, ఎమ్మీ మాగుంట శ్రీనివాసులురెడ్డి, కోఆపరేటివ్ బ్యాంక్ అధ్యక్షుడు వాకాటి నారాయణరెడ్డి, మాజీ ఎమ్మెల్యే పోలంరెడ్డి శ్రీనివాసులురెడ్డి తదితరులంతా హాజరైనారు. రాజీవ్‌భవన్ శ్రామికుడు కోటంరెడ్డి శ్రీధర్ రెడ్డి సభ నిర్వహించాడు. నెల్లూరు కాంగ్రెస్ ఇన్‌ఛార్జి డాక్టర్ అనిల్‌కుమార్ యాదవ్ పై పెత్తనం చేశాడు. జిప ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి అధ్యక్షత వహించాడు. ఉక్కపోతతో ఎప్పుడెప్పుడు బయట పడదామా అన్న ఆతృతలో వుండి కూడా అతిథులు చక్కటి ఉపన్యాసాలు చేశారు. ధర్మాన ప్రసాదరావు మాటలు మనసులోనుంచి వచ్చినట్లు వుండినాయి. ఈరోజు మంత్రులుగా వున్న వారిలో సగం మందికి రాజకీయ భిక్ష పెట్టింది జనార్దనరెడ్డిగారే, ఆయన నుంచి తామంతా చాలా నేర్చుకొన్నాం, ఆయన నెల్లూరుజిల్లాకు నాయకుడు కాదు, జాతీయనేత, ఆయనకున్న పార్టీ నిబద్ధత అందరికీ ఆదర్శం అన్నాడు ధర్మాన. జెసి.దివాకర్‌రెడ్డి కూడా జనార్దనరెడ్డిని అభినందనలతో ముంచెత్తాడు. ఇక్కడి ఇందిరాభవన్ ఆదర్శంతో తనతోపాటు రాష్ట్రంలోని పలువురు తమ తమ జిల్లాలో కాంగ్రెస్ భవనాలు కట్టారని చెప్పాడు దివాకర్‌రెడ్డి. ఆయన వంటి పరిపాలనాదక్షుడ్ని మన రాష్ట్రంలో వేరొకరిని చూడలేదని చెప్పాడు.

### ఆ శ్రద్ధేదో పార్టీ మీద పెడితే మంచిది!

జనార్దనరెడ్డి గారు ముక్తసరిగా మాట్లాడినా మనసు తాకే మాటలు చెప్పారు. కాంగ్రెస్ పార్టీ పట్ల నాకున్న నిబద్ధత గుర్తించి సోనియాగాంధీ ఈ పదవి కట్టబెట్టారు. నా జీవితంలో కాంగ్రెస్ సేవ తప్ప మరొక విషయం లేదు. కాంగ్రెస్‌పార్టీ ఇక మిగలదన్న రోజులలో, రాజకీయం మొత్తం భూస్వాముల గుప్పెట్లో చిక్కుకొన్న రోజులలో సి.వి.శేషారెడ్డి, యానాదిరెడ్డి వంటి సామాన్యులను ఎమ్మెల్యేలుగా చేసి, జిల్లాలోని మొత్తం సీట్లను గెలిపించాను. ఇందిరాగాంధీ, రాజీవ్‌గాంధీ, ఇప్పుడు సోనియా గాంధీ కూడా నా కాంగ్రెస్ భక్తిని గుర్తించారు. గౌరవించారు. వూపిరున్నంత వరకు ఇదే విధేయతతో కాంగ్రెస్‌కు సేవ చేస్తాను అన్నాడు జనార్దనరెడ్డి గారు.

ఈ సభకు మంత్రులు రాకుండా చేయాలని నానా తంటాలుపడ్డారు కొందరు. ఆ శ్రద్ధ ఏదో పార్టీ కోసం పెడితే అందరికీ మంచిది. నా సభకు జనం రారని ఇందిరాభవన్‌లో పెట్టారని మరికొందరు వ్యాఖ్యానించారు. అట్లా మాటలు తూలిన వారు ఇప్పుడిక్కడకు వస్తే, వారు నిల్చోవడానికి కూడా చోటు లేదని చురక అంటించారు.

మొత్తం మీద జనార్దనరెడ్డికి జిల్లా కాంగ్రెస్ వాదులు తలపెట్టిన ఆత్మీయ సత్కార సభ అక్షరాల ఆత్మీయంగానే జరిగింది.

---

## జనవాణి

3వ పేజీ కొరవ

సర్వసాధారణమైపోయాయి. మైపాడు వెళ్లే రహదారిలో కొళాయిల నుంచి నీరు ఎప్పుడూ వృధాగా పోతుంటుంది. నీటి కోసం భవిష్యత్తులో యుద్ధాలు తప్పవని ఐక్యరాజ్యసమితి హెచ్చరించిన నేపథ్యంలోనైనా త్రాగునీటి సరఫరాపై అధికారగణం దృష్టికేంద్రీకరించాలి.

–సిహెచ్.సురేష్‌బాబు, నెల్లూరు

### శ్రీకృష్ణ దేవరాయలు పట్టాభిషేకం!

విజయనగర సామ్రాజ్య ఖ్యాతిపెంచిన శ్రీకృష్ణదేవరాయలు పట్టాభిషేకం జరిగి 500ఏళ్లు పూర్తయిన సందర్భంగా ప్రభుత్వం ప్రత్యేక వుత్సవాలు జరుపుతుంది. జిల్లాలో వీటిని ఉదయగిరిలో నిర్వహించను జిల్లా అధికారయంత్రాంగం ఏర్పాట్లు చేస్తున్నారు. పుదూరు, తుమ్మగుంట అగ్రహారాలను శ్రీకృష్ణదేవరాయలునే ఏర్పాటు చేశారు. ఇక్కడ సైతం ఆ ఉత్సవాలు జరుపమని వినతి.

–బి.సావిత్రి, నెల్లూరు

---

## జగన్నాటకం

మొదటి పేజీ కొరవ

అటు, లేకుంటే వెళ్లడం తప్ప మధ్యస్థం మార్గం మిగలలేదు ఎమ్మెల్యేలకు.

సోనియాగాంధీని కలిసి, ఢిల్లీ నుంచి తిరిగి వచ్చినప్పటి నుంచి జగన్ దగ్గరకు వెళ్లడానికే భయపడుతున్నారు కాంగ్రెస్ నేతలు. వెళ్తే పార్టీ వెలి తప్పదని హడలి చస్తున్నారు. ఈ పరిస్థితులలో పది పన్నెండు మందికి మించి ఎమ్మెల్యేలు జగన్ పక్షంగా నిలిచే అవకాశం లేదని ఒక అంచనా. సంఖ్య అంత తక్కువకు పరిమితమైతే జగన్ రాజకీయ ప్రాభవం మసకబారుతుంది. కనీసం పాతిక ముప్పై మందినైనా సమీకరించగల్గితే ప్రభుత్వానికి హెచ్చరికగా పని చేస్తుందని, తనంటేభయం ఏర్పడుతుందని జగన్ ప్రయత్నం. కానీ ఇప్పటివరకు అది జరిగే సూచనలు లేవు.

మొత్తం మీద రాబోయే వారం రాష్ట్ర రాజకీయాలకు చాలా కీలకమైనది. అధిష్టానానికి, జగన్‌కు మధ్య మొదలు కాబోతున్న రణం ఏ పరిణామాలకు దారి తీస్తుందో వేచి చూడడం తప్ప ఇప్పట్లో ఎవరు చేయగల్గింది ఏదీ లేదు.

---

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

### వెలమ విద్యార్థులకు స్కాలర్ షిప్పులు

టెన్త్, ఇంటర్, డిగ్రీ పాసయ్యి పై తరగతిలో చేరగోరే వెలమ విద్యార్థినీ, విద్యార్థులకు నెల్లూరు జిల్లా వెలమ సంఘం స్కాలర్ షిప్పులివ్వదలచింది. ఆసక్తి వున్న వాళ్లు దరఖాస్తును తెల్ల కాగితంపై వ్రాసి, మార్కుల లిస్టు జెరాక్స్, ఇన్‌కమ్ సర్టిఫికేట్‌ను జూలై 24వ తేదిలోగా పెళ్లూరు రామయ్యనాయుడు, కార్యదర్శి. వెలమ సంఘం, రెవిన్యూ కాలనీ, నెల్లూరు – 4 చిరునామాకు పంపమంటున్నారు.

### రాఘవేంద్ర షెట్టికి రోటరీ క్లబ్ బాధ్యతలు

నెల్లూరు రోటరీ క్లబ్ అధ్యక్షునిగా సూడా రాఘవేంద్ర షెట్టి, కార్యదర్శిగా మధుసూదనరావు 27వ తేది బాధ్యతలు స్వీకరించారు. రోటరీ జిల్లా మాజీ గవర్నర్ సోమ సుందర సాయి వీరి చేత ప్రమాణ స్వీకారం చేయించారు. ఎస్పీ దామోదర్, నెల్లూరులో ఇస్కాన్ సంస్థ నిర్వాహకుడు సుఖదేవానంద స్వామి, రోటరీ గవర్నర్ భరత్‌కుమార్‌రెడ్డి ముఖ్య అతిథులుగా విచ్చేశారు. ఈ సందర్భంగా రాఘవేంద్ర షెట్టి క్లబ్‌కు 25వేల రూపాయల విరాళాన్ని అందించారు.

### కూరగాయల రేట్లు కాస్త తగ్గాయి!

నెల్లూరు ఏసి కూరగాయల మార్కెట్‌లో గత రెండు మూడు రోజులుగా కూరగాయల ధరలు ఓ మోస్తరుగా తగ్గాయి. కేజి 40 రూపాయలకు పైగా విక్రయించిన బీన్స్, క్యారట్ ధర ఇరవై రూపాయలయ్యింది. 30 రూపాయలుగా అమ్ముతుండిన పందిరి చిక్కుళ్లు, నెల్లూరు వంకాయలు 20 రూపాయలకు దొరుకుతున్నాయి. కాకరకాయలు, దొండకాయలు, బెండకాయల ధరల్లోనూ మార్పు కనిపిస్తుంది. దోసకాయ లైతే బాగా తగ్గి కిలో ఆరు రూపాయలకు అమ్ముతున్నారు. అయితే పచ్చిమిర్చి, అల్లం ధరలు ఏమాత్రం తగ్గలేదు. ఆకుకూరల ధరలు ఇంకా కొండెక్కే కూర్చొని వున్నాయి.

### గస్తీకి బస్తీ జనం!

నెల్లూరు నగరంలో పెచ్చుపెరిగి పోయిన సంఘ విద్రోహ కార్యకలాపాలను అరికట్టను గతంలో వుండిన ప్రజా గస్తీ దళాలను పోలిన స్పెషల్ ప్రొటెక్షన్ ఆఫీసర్లు(ఎస్‌పిఓ) వ్యవస్థ ఏర్పాటుకు పోలీసులు సిద్ధమవుతున్నారు. దీనికి ముందుకు వచ్చిన 117 మందితో డిఎస్పీ రాధిక 27వ తేది తన క్యాంప్ కార్యాలయంలో సమావేశమయ్యారు. ట్రాఫిక్‌ను సరిదిద్దే వ్యవహారంలోనూ వీరి సేవలు ఉపయోగించుకొంటారట. ఈ వ్యవస్థ మంచిదే. దీనికి ఎంపిక చేసిన వ్యక్తులు సరిలేకుంటే వ్యవహారం గందరగోళమవుతుంది.

### ఈదూరు సుబ్బయ్య సాహితీ పురస్కారం!

సాహిత్యాభిలాషి స్వర్గీయ ఈదూరు సుబ్బయ్య స్మారకార్థం ఆయన కుమారులు ఈదూరు శేషయ్య, డాక్టర్ ఈదూరు సుధాకర్‌లు సాహితీ పురస్కారం ఇవ్వను ముందుకొచ్చారు. ఈ పోటీలో పాల్గొనదలచిన వారు 2008, 2009, 2010 సంవత్సరాలలో వంద పేజీలకు తక్కువ కాకుండా ముద్రించబడిన మూడు ప్రతుల కవితా సంపుటిలను అక్టోబర్ 31వ తేదీలోగా డాక్టర్ ఈదూరు సుధాకర్, 204, క్రిసెంట్ మానర్, శాంతినగర్, నెల్లూరు –3 చిరునామాకు పంపమంటున్నారు. ఉత్తమ కవితా సంపుటికి పదివేల రూపాయల పురస్కారాన్ని, జ్ఞాపిక, ప్రశంసాపత్రం, దుశ్శాలువతో ఘనంగా సత్కరిస్తామంటున్నారు.

### చామకూరు సుబ్బమ్మ మరణం

చిల్లకూరు మండలం లింగవరం వాసి, నెల్లూరు బాలాజీనగర్ నివాసి చామకూరు సుబ్బలక్ష్మమ్మ 24వ తేది మరణించారు. చిన్నతనం నుంచి పరిస్థితులతో రాజీలేని పోరాటం చేసిన గృహిణి ఆమె. ఆమె పడిన కష్టం ఫలించి కన్నబిడ్డలు ఎంతో ఉన్నతికి ఎదిగారు. ఆమె కుమార్తె కుసుమకుమారి అమెరికాలో స్థిరపడ్డారు. అల్లుడు కొట్టే ఉదయభాస్కర్ క్వాలిటీ అసెస్మెంట్ విభాగంలో అమెరికా దేశంలోనే అత్యంత ప్రముఖుడిగా కీర్తి సాధించారు. కుమారుడు హరగోపాల్ నెల్లూరులో విద్యా సంస్థల స్థాపకుడిగా నిలదొక్కుకున్నాడు. వారి కుటుంబానికి మా సానుభూతి.

### టౌన్‌హాల్ గుమాస్తా మరణం

నెల్లూరు టౌన్‌హాల్ రీడింగ్ రూమ్ గుమాస్తాగా 43 ఏళ్లపాటు పనిచేసిన బి.వి.సుబ్రహ్మణ్యం(73) 24వ తేది మరణించారు. టౌన్‌హాల్‌కు వచ్చే ప్రతి ఒక్కరికి తలలో నాలుకలా వ్యవహరించే వాడాయన. ఆయనకు భార్య, కుమారుడున్నాడు. కుమారుడు ప్రతిష్టాత్మకమైన సంస్థ హైదరాబాద్ లోని అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ కాలేజి ఆఫ్ ఇండియాలో అసోసియేట్ ప్రొఫెసర్. ఆత్మీయుడిని కోల్పోయిన వీరి కుటుంబానికి మా సానుభూతి.

# నవరసభరితం బహురూప!

"విభిన్న కళారూపాలను ఒకే వేదిక మీద ప్రదర్శింపజేసేలా చూసిన జి.ప.ఛైర్మన్ అభినందనీయుడు."



బహురూపలో పురాతన సంగీత వాయిద్యం దిల్‌రూబాను శృతి చేస్తున్న శ్రీనివాసరావు.

కళలు సంస్కృతి సాంప్రదాయాలకు ప్రతీక. సమాజాన్ని ప్రభావితం చేసే కళలకు, కళాకారులకు నేడు ప్రోత్సాహం లేకుండా పోయిందన్న మాట ప్రతిఒక్కరు వెలిబుస్తున్న అభిప్రాయం. మసకబారిపోయిన కళలకు, ఆదరణ లేక, ప్రోత్సహించేవారు లేక క్రమంగా కనుమరుగౌతున్న కళలు, కళాకారులను వెలుగులోకి తెచ్చేందుకు, వారికి ప్రోత్సాహం అందించేందుకు జిల్లాపరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధనరెడ్డి నడుంబిగించారు. ఇప్పటివరకు విద్యార్థులకు చక్కని విద్యను అందించేందుకు ప్రోత్సాహకాలను అందిస్తున్న ఆయన సాంప్రదాయ కళలకు తిరిగి జీవం పోసేందుకు, ప్రతిభ గల కళాకారులకు ప్రోత్సాహం అందించేందుకు బహురూప అనే కార్యక్రమాన్ని నిర్వహించారు. పురమందిరం ఈ నవరసభరిత కార్యక్రమానికి వేదికయ్యింది. వివిధ వేషధారణలు, సంగీత కార్యక్రమాలు షుమారు 60పైగా జరిగిన బహురూప ప్రేక్షకుల్ని కట్టిపడేసింది.

ఈ బహురూప కార్యక్రమంలో అందరి మన్ననలు అందుకొన్నది దిల్‌రూబా సంగీతం. వెంకటగిరి సంస్థానంలో వాయిద్యకారుడిగా పనిచేసిన 87 ఏళ్ల వృద్ధ సంగీతకారుడు శ్రీనివాసరావు దిల్‌రూబాను పలికించిన తీరు ఆహుతులను మంత్రముగ్దులను చేసింది. సాయి హేమంత్ ముక్కుతో వేణుగానాన్ని ఆలపించిన తీరు ఆశ్చర్యపరచింది. మైపాడు రాజా బహురూపధారణ కరతాళ ధ్వనులు మిన్నుముట్టేలా చేసింది. వెంకటేశ్వరస్వామిగా, ఎంజిఆర్‌గా, బిన్ లాడెన్‌గా క్షణాల్లో వేషం మార్చి ప్రదర్శించిన తీరు ప్రశంసలు అందుకొంది. సంగీత పరికరాలన్నింటిని తన కంఠంలో ఇముడ్చుకొన్నాడా అన్న తీరులో డిటిఎస్ ఆనంద్ నోటితో వివిధ పరికరాల ధ్వనులను పలికించిన తీరు ఆశ్చర్యచకితులను చేసిందనే చెప్పాలి. నదియా ప్రదర్శించిన నృత్యహేల, జడ్పీటిసి సభ్యుడు పెంచలయ్య పోషించిన దుర్యోధన పాత్ర ఆకట్టుకొన్నాయి. అలాగే కూచిపూడి, భరతనాట్యం, జానపద నృత్యాలు, మిమిక్రీ, ముకాభినయం, పౌరాణిక పాత్రలు, లోకేష్ వయొలిన్ వాయిద్యం ఆయా కళాకారుల ప్రతిభాపాఠవాలకు అద్దం పట్టాయి. జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్ రెడ్డి అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో జిల్లా కలెక్టర్ రాంగోపాల్, ఎస్పీ దామోదర్, వెంకటగిరి, గూడూరు, కావలి శాసనసభ్యులు కురుగొండ్ల రామకృష్ణ, బల్లి దుర్గాప్రసాద్‌రావు, బీద మస్తాన్‌రావు, శాసన మండలి సభ్యుడు విఠపు బాలసుబ్రమణ్యం, డ్వామా పిడి రామిరెడ్డి, జడ్పీ వైస్ ఛైర్మన్ రాజా, బివి.నరసింహం తదితరులు పాల్గొన్నారు. కార్యక్రమం చివరన వృద్ధ కళాకారుడు, దిల్‌రూబా సంగీత పరికరాన్ని అత్యద్భుతంగా పలికించిన శ్రీనివాసరావుకు కలెక్టర్ రాంగోపాల్ ఐదు వేల రూపాయల నగదును అందించగా, జడ్పీఛైర్మన్ శాలువాకప్పి సత్కరించారు.

### కళాకారులను ప్రోత్సహించేందుకు..

సాంప్రదాయ కళలను, కళాకారులను ప్రోత్సహించేందుకే బహురూప కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నాం. కళాకారులు కంటతడిపెడితే సమాజానికి మంచిది కాదు. నేటితరానికి సాంప్రదాయ కళలను పరిచయం చేయాలన్నదే మా ఉద్దేశ్యం. నాటి హరిదాసులు కనిపించడం లేదు. గంగిరెద్దులు కనుమరుగౌతున్నాయి. ఇది ఎంతో బాధ కల్గించే అంశం. అందుకే బహురూపను నిర్వహించి కళాకారులను ప్రోత్సహించదలచాం.

**-కాకాణి గోవర్ధన్‌రెడ్డి,** *జడ్పీఛైర్మన్.*

### ప్రజలే కళలను కాపాడుకోవాలి

సాంప్రదాయ కళలను కాపాడుకోవాల్సిన బాధ్యత ప్రజలపై వుంది. ప్రభుత్వం పింఛను లాంటి సౌకర్యం కళాకారులకు కల్పించినప్పటికి కళలు అంతరించిపోకుండా పది కాలాలపాటు బ్రతికి వుండాలంటే అందరూ చేయూతనందించాలి. ఇలాంటి కార్యక్రమాన్ని నిర్వహించడం అభినందనీయం. వేసవి సెలవుల్లో వారం రోజులపాటు ఈ కార్యక్రమాలను నిర్వహించినట్లయితే పిల్లలకు ఎంతో ప్రయోజనకరంగా వుంటుంది.

**-కె.రాంగోపాల్,** *జిల్లా కలెక్టర్.*

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/09-11



### పెల్లుబికిన ఆత్మీయతా ఉప్పెనలో

# మునకలేసిన జనార్ధనరెడ్డి!

అనుబంధం, ఆత్మీయత అంతా ఒక బూటకమని తేల్చి పారేశాడు ఒక సినిమా కవి. కానీ ఆ రెండింటిలో ఎంతో మహత్తరమైన మానసిక బంధం ఇమిడి వుంది. అది విడదీయరానిది. మనసు లోలోపలి పొరల్లో దాగి, నిద్రాణంగా కన్పించినా, సందర్భం, సమయం వస్తే సముద్రంలో ఉప్పెన మాదిరి పైకి పెల్లుబకడం ఆ బంధంలోని మహత్యం. హృదయాన్ని ఆర్ధ్రంగా, తడితడిగా, శ్వాసనిశ్వాసాలను భారంగా మార్చే ఆ మానసిక భావన, దాన్ని అనుభవించిన వాడికే అర్ధమౌతుంది.

మాజీ ముఖ్యమంత్రి, రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు నేదురుమల్లి జనార్ధనరెడ్డి పట్ల తమ ఆత్మీయతను, అనుబంధాన్ని నెల్లూరు కాంగ్రెస్‌వాదులు అట్లా అనుభవించి పలవరించారా అన్పించింది - మొన్న 29తేది సాయంత్రం ఇందిరాభవన్‌లో ఆయనకు జరిగిన అభినందన సభ చూసిన వారికి. ముచ్చటగా మూడోసారి రాజ్యసభకు ఎన్నికైనందుకు జరిగిందీ సభ. సందర్భంలో పెద్ద విశేషం లేదు. గత నలభై ఏళ్లుగా ఎన్నో పదవులు వాటంతట అవిగా వచ్చి వరించాయి ఆయన్ను. పదవులు ఆయనకు కొత్త కాదు, పదవులకు ఆయన కొత్తవాడూ కాదు. నలభైఏళ్ల క్రితమే రాజ్యసభలో అడుగుపెట్టిన వాడికి, ఇప్పుడు కొత్తగా ఆ పదవి వల్ల వచ్చే అదనపు ఆకర్షణ ఏమీ లేదు. అయినాసరే నెల్లూరు కాంగ్రెస్‌వాదులలో గూడుకట్టుకొన్న అభిమానం ఈ చిరు సందర్భంలో కూడా ఉప్పెన వలె పైకి ఉబికింది. కట్టలు తెంచుకొన్న నదీ ప్రవాహం వలె పెల్లుబికింది.

సభ ఆరు గంటలకైతే, ఐదు గంటలనుంచే అలలు అలలుగా జనం వస్తూనే వున్నారు. ఇందిరా భవన్ పొంగి పొర్లింది. ఆరుబయట ఖాళీ స్థలం కిటకిటలాడిపోయింది. మూడు పక్కలా వీధులు నిండిపోయాయి. సాధారణ రాజకీయ సభల వలె డబ్బిచ్చి, మందిచ్చి తోలుకొచ్చిన జనం కాదు. ఎవరూ బొట్టుపెట్టి పిలిచిన పాపాన పోలేదు. ఆకర్షణకు సినీతారలు లేరు. స్వామీజీలూ లేరు. ఆ సమయానికి అక్కడ వాతావరణం చాలా ఇబ్బందిగా వుండింది. భరించలేని ఉక్కపోత. చొక్కాలు తడిచిపోయాయి. గాలి ఆచూకీ లేదు. కాలు కదపడానికి వీలులేని జన సమర్ధం వల్ల పరిస్థితి మరింత దుర్భరంగా మారింది. కొందరైతే ఊపిరాడక విలవిల లాడారు. అయినాసరే జనం కదలలేదు.

నెల్లూరుజిల్లా వరకు కాంగ్రెస్ పార్టీకి పర్యాయపదం జనార్ధనరెడ్డి. ఆయనకు పార్టీ పట్ల వున్న అంకిత భావం అచంచలమైనది. ఎన్నో ఆటుపోట్లలో నికార్సైనదిగా రుజువైంది. పదవి వున్నా లేకపోయినా, ఆదరించి దగ్గరకు తీసినా మెడపెట్టి బయటకు గెంటే పరిస్థితి సృష్టించినా పార్టీ పట్ల తన భక్తిని మార్చుకోని అరుదైన రాజకీయ వ్యక్తిత్వం. కాంగ్రెస్‌పట్ల ఆయన ప్రదర్శిస్తూ వచ్చిన బంధం, సాధారణ కాంగ్రెస్‌వాదులలో ఆయన పట్ల ఆత్మీయతను పెంచింది. అనుబంధాన్ని బిగించింది. దానికి రుజువే ఈ సభ.



ఇందిరాభవన్‌లో జరిగిన ఆత్మీయ సభలో మాట్లాడుతున్న జనార్ధనరెడ్డి.

ఇందిరాభవన్ చిన్నదని నిర్వాహకులకు తెలుసు. కానీ దానితో జనార్ధనరెడ్డికి గల ఆత్మీయబంధం మాటలతో వర్ణించేది కాదు. ఆంధ్రప్రదేశ్ పొలిమేరలలో కాంగ్రెస్‌కు పుట్టగతులు లేవనే భావన ప్రబలివున్న రోజులలో, ఎన్టీఆర్ సమ్మోహనా ప్రభంజనంలో కోట్లాది ఆంధ్రులు సుళ్లు తిరుగుతున్న కాలంలో, కాంగ్రెస్‌వాదినని చెప్పుకోవడానికి ఎవరూ సాహసించని పరిస్థితులలో ఈ ఇందిరా భవన్ నిర్మించాడు జనార్ధనరెడ్డి. అప్పట్లో ఇందిరా గాంధీ దృష్టిలో కూడా పడిందీ విషయం. ఆయన

కొరవ 14వ పేజీలో

● పారిశ్రామిక బ్రహ్మ

# నిప్పో ఓబుల్‌రెడ్డి మరణం

నిప్పో ఓబుల్‌రెడ్డి మరణించారు. 30తేది మధ్యాహ్నం మద్రాసులోని ఒక ఆస్పత్రిలో 85ఏళ్ల తన సార్ధక జీవితానికి విశ్రాంతి కల్పించుకొన్నాడు.

ఓబుల్‌రెడ్డి గారిది మన వూరు కాదు. నెల్లూరులో ఏనాడూ ఆయన కాపురం వుండలేదు. కానీ నెల్లూరు జిల్లాతో ఆయన అనుబంధం ప్రగాఢమైనది. కొన్ని వేల మంది కుటుంబాలలో బ్రతుకు దీపం వెలిగించిన వాడాయన. 1970లో ఆయన నిప్పో ఫ్యాక్టరీ నిర్మాణం తలపెట్టినప్పుడు నెల్లూరు జిల్లాలో పరిశ్రమల స్థాపనకు ఏ మాత్రం సానుకూల వాతావరణం లేదు. రామకోటయ్య, ఎన్‌వి.కృష్ణయ్య వంటి కార్మిక నాయకుల హ్రస్వదృష్టి వల్ల ఇక్కడ పరిశ్రమ పెడితే చెప్పుదెబ్బలు తప్ప మరే ప్రయోజనం లేదన్న నిరాశ నెలకొని వుండింది. పదిమందికి ఉద్యోగాలిచ్చే ఫ్యాక్టరీలన్నిటిలో నిత్య అసమ్మతి. అనుక్షణం ఉద్రిక్తతలు. అయినాసరే ఓబుల్‌రెడ్డి గారు లెక్క చేయలేదు. అప్పటికే గోద్రెజ్ బీరువాల వ్యాపారం ద్వారా నెల్లూరుతో పరిచయం వున్న ఆయన, తన బృహత్ పరిశ్రమకు నెల్లూరునే కేంద్రంగా ఎంచుకొన్నాడు. ఆ సాహసం చేయవద్దని ఎందరో వారించారాయన్ను.

1972లో పునాదిరాయి వేసి, తొమ్మిదంటే తొమ్మిది నెలల్లో ఉత్పత్తి ప్రారంభించడం - నలభై ఏళ్ల వెనక్కు వెళ్లి ఆలోచిస్తే ఒక అద్భుతం. ఓబుల్‌రెడ్డి గారి పట్టుదల, కార్యదక్షతలకు అదొక నిదర్శనం. అప్పట్లో నెల్లూరులో హోటళ్లు వుండేవి కావు. నివాసానికి తగిన ఇళ్లు కూడా లేవు. మద్రాసు నుంచి రాకపోకలు ఎంతో శ్రమ. కారులో రావాలన్నా ఆరేడుగంటల వ్యవధి పట్టేది. ఈ కష్టాలు ఆయన్ను నిరుత్సాహపరచలేదు.

నిప్పో ఫ్యాక్టరీ కట్టి నలభై ఏళ్లయ్యింది. ఇంత సుదీర్ఘకాలంలో దానిలో ఒక చిన్నపాటి పారిశ్రామిక అశాంతి సంఘటన తలెత్తలేదు. ఎందరో కార్మిక నాయకులు ఎన్నో రకాల ప్రయత్నం చేశారు. ఓబుల్‌రెడ్డి చతురత ముందు వారి ఆటలు సాగలేదు. పెట్టినప్పుడు ఆ ఫ్యాక్టరీ పెట్టుబడి మూడుకోట్ల రూపాయలు. ఇప్పటి విలువతో పోలిస్తే అది మూడు వందలో, మూడు వేలో అవుతుంది. ఫ్యాక్టరీ నిర్మాణంలో చూపిన పట్టుదలకు ధీటుగా వ్యాపార నిర్వహణలోనూ ప్రతిభ ప్రదర్శించడం వల్ల నిప్పో సంస్థ శరవేగంగా పురోగమించింది. తడలో రెండవ ఫ్యాక్టరీ వచ్చింది. దాదాపు నాలుగు వేల మంది కుటుంబాలకు శాశ్వత ఉపాధి చూపించింది. నిప్పోలో ఉద్యోగం సర్కారీ నౌకరీతో సమానమన్న గుర్తింపు వుంది.

ఆ తర్వాత ఆయన చాలా వ్యాపారాలు చేశాడు. చాలా పరిశ్రమలే పెట్టాడు. దక్షిణ భారత దేశంలో పేరున్న పారిశ్రామికుడిగా ఎదిగాడు. కరుణానిధి వంటివారి చేత "నోబుల్‌రెడ్డి" అన్పించుకొన్నాడు. దానితో పాటే ధార్మిక సాంస్కృతిక కార్యక్రమాలెన్నిటినో నిర్వహించాడు. లెక్కలేనన్ని దాన ధర్మాలు చేశాడు. పిల్లలకు స్కూల్ కట్టించాడు. పేదల కోసం తడలో ఆస్పత్రి నిర్మించాడు. దేవాలయాలకు జీర్ణోద్ధారణ చేశాడు. ఇంతింతై వటుడింతైనట్లుగా ఎదిగాడు. ఎన్నో సత్కారాలు, సన్మానాలు అందుకొన్నాడు. వాటన్నిటినీ ఒకసారి పరామర్శించి చూస్తే, ఆయన జీవితం ఎంత సార్ధకమైనదో అన్పిస్తుంది.

ఓబుల్‌రెడ్డి గారు మరణించారంటే మనసుకు బాధ కల్గుతున్నది. కానీ నెల్లూరు ప్రజల మనసులో మాత్రం ఆయనకు మరణం లేదన్న భరోసాతో వూరట కల్గుతున్నది. నెల్లూరుజిల్లా వాసుల దృష్టిలో ఆయన పారిశ్రామిక బ్రహ్మ. బ్రహ్మకు మరణం వుంటుందా? ఓబుల్‌రెడ్డిగారి సతీమణి కొద్దికాలం క్రితం కన్ను మూశారు. వారికి ఇద్దరు కుమారులు, నలుగురు కుమార్తెలు. అందరూ జీవితాలలో స్థిరపడిన వారే. ఉన్నత శిఖరాలు చూసినవారే. అపోలో ఆస్పత్రి అధినేత ఆయన వియ్యంకులలో ఒకరు. నిప్పోను ఒక పరిశ్రమగా కాకుండా తమ జీవితాలకు వెలుగునిచ్చిన దేవాలయంగాభావించే వేలాది కార్మిక కుటుంబాలకు మా ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నాము.

నిప్పో ట్రేడ్ యూనియన్‌కు కొన్ని దశాబ్దాల పాటు నాయకత్వం వహించి ఫ్యాక్టరీతోపాటు కార్మికుల శ్రేయస్సు కాపాడుతూనే వివాదాలు తలెత్తకుండా చూసిన ఐఎన్‌టియుసి నాయకుడు ఎల్వీ కృష్ణారెడ్డి ఓబుల్‌రెడ్డి మరణానికి ప్రగాఢ సానుభూతి తెలియజేశారు.

## కార్టూన్ స్కేప్




ఇక ఓటరు దేవుడిచ్చే అవకాశమే
ఎలా ఉంటుందో చూడాలి మరి!

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.